మతగ్రంథ ప్రచురణ సహాయ పథకము క్రింద

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారి

రచయితలకు ఆర్థిక సహాయ పథకము ద్వారా

గ్రంథకర్త చే ముద్రితము

**1998**

# గ్రంథకర్త పరిచయం

ఎల్లాప్రగడ రామకృష్ణారావు, గుంటూరులో జన్మించారు. హైదరాబాదు వివేకవర్ధనీ కళాశాలలో బి.ఎస్‌సి. పట్టభద్రులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆర్ట్స్ కాలేజీ నుండి ఎం.ఏ (తెలుగు) ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

ఆధునికాంధ్ర సాహిత్యంలో చైతన్య స్రవంతి ( అనే అంశంపై ప్రామాణికమైన పరిశోధన చేసి ఎం.ఫిల్ పట్టం పొందారు. భాషాశాస్త్రంలో పి.జి. డిప్లొమా ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

కొంత కాలం ఫ్రెంచి భాషాధ్యయనం చేశారు.

'ఈనాడు'లో రెండు సంవత్సరాలు పాత్రికేయునిగా పనిచేశారు.

గత **19** సంవత్సరాలుగా హైదరాబాదులోని చైతన్య కళాశాలలో ఆంధ్రోపన్యాసకునిగా పని చేస్తున్నారు. పెక్కు కవితలు, గేయాలు, విమర్శలు, సమీక్షలు, పరిశోధక వ్యాసాలను వివిధ పత్రికలలో ప్రచురించారు. దృశ్య నాటికలు, సంగీత రూపకాలు, నృత్యరూపకాలు అనేకం రచించారు.

వీరు రచించిన 'కదలిగుండె' కవితా సంకలనానికి **1984** దేవులపల్లి కృష్ణశాస్త్రి అవార్డు, **1985** ఉమ్మెత్తల అవార్డు లభించాయి.

'రాగధుని' లలితగేయ సంపుటి, ఆధునికాంధ్ర సాహిత్యంలో చైతన్య స్రవంతి-ఎంఫిల్ సిద్ధాంత వ్యాసం ఇతర ముద్రిత రచనలు.

కొన్ని చలన చిత్రాలకు పాటలు రాశారు.

వీరు రచించిన లలిత, భక్తి గేయాల కాసెట్లు విడుదలై ప్రజాదరణ చూరగొన్నాయి. పలు సాహితీ సాంస్కృతిక సంస్థలకు సలహాదారు, సన్నిహితులు.

వివిధ తెలుగు పత్రికలు, ఆకాశవాణి, దూరదర్శన్‌ల ద్వారా తెలుగువారికి సుపరిచితులు.

# విరాటభారతి

(సంస్కృత విరాట పర్వాంతర్గత సూక్తివైభవం)



వై. రామకృష్ణారావు (ఎల్లాప్రగడ)
హైదరాబాదు

1998

విరాటభారతి

- వై. రామకృష్ణారావు

ప్రథమ ముద్రణ :
అక్టోబరు, 1998

750 ప్రతులు

ముఖచిత్రం :
'పాప'

వెల : రూ.20/-

ప్రతులకు :
గ్రంథకర్త
201, సౌత్ ఎండ్ పార్కు,
మన్సూరాబాదు, హైదరాబాదు - 500 068
(రంగారెడ్డి జిల్లా)

ఎమెస్కో పబ్లిషర్సు
ఏలూరు రోడ్డు
విజయవాడ - 2.

ముద్రణ :
జగపతి ఆర్ట్ ప్రింటర్స్,
హిమాయత్‌నగర్, హైదరాబాదు.

# అంకితం



తిరుపతి వేంకటరమణా!

కరుణామయ! నీదు కృపను కల్గిన విద్యా

గరిమను నే నొనరించిన

విరాటభారతిని గొనగ వేడెద భక్తిన్

''కవి కౌస్తుభ''
డా. ఆచార్య తిరుమల
301, నందిని కాంప్లెక్సు,
మోజంజాహి మార్కెట్,
హైదరాబాదు - 590 095.

# గుణధ్వని

''నరోవై దేవానాం గ్రామః'' అని శ్రుతి వక్కాణిస్తూ ఉంది. ఆ దివ్యత్వాన్ని సాధించటానికే ఆధ్యాత్మిక విద్య అవసరమయ్యింది. మనకు పరోక్షంగా వున్న ఆ తాత్త్విక జ్ఞాన సంపదని స్వయం భూ బ్రహ్మ యొక్క అనుజ్ఞతో తపస్సుల ద్వారా పొందిన మహర్షులు లోక కల్యాణం కోసం వేదాల రూపంలో, పురాణాల రూపంలో, శాస్త్రాల రూపంలో, కావ్యాల రూపంలో ఆవిష్కరించారు. ప్రపంచానికి భారతదేశం ప్రసాదించిన గొప్ప సంపద అదే! ఆధ్యాత్మిక జ్ఞానం వల్ల తప్ప ఎక్కడా ఏ మనిషికీ శాంతి లేదు; ఏ సంఘానికి భద్రత లేదు. ఈ విషయాన్ని అలసులు, మంద బుద్ధులు తెలుసుకోలేరు. అటువంటి వారికి కూడా తెలియజెప్పటానికే 'సూక్తి' సాహిత్యం అవతరించింది. మంచి మాట విని, ఆచరించి, ఆనందాన్ని పొంది తరించుమని అభ్యర్థించింది. ''యద్యదాచరతి శ్రేష్ఠః''! అటువంటి ఆప్త కామన తో ఆవిర్భవించిన విరాణ్మూర్తి ప్రతిబింబమే యీ ''విరాట భారతి''! ఇది భారత భారతికి ఎత్తి పట్టిన కర్పూర హారతి!.

వైదిక వాఙ్మయంలో భారత, భాగవత, రామాయణాలకు విశిష్టమైన స్థానం ఉంది. ఇవి మనకు ఆత్మ చరిత్రలు. మనకు కనిపించే యీ స్థూల శరీరంలో సూక్ష్మ, కారణ శరీరాలని మరో రెండు శరీరాలున్నాయి. ఈ మూడు శరీరాల స్థితి గతుల్ని గూర్చి భారత, భాగవత, రామాయణాలు చెప్తున్నాయి. వాటిలో భారతం స్థూల శరీర సంబంధి. ''అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః'' - అని వైశ్వానరాగ్ని వల్లనే ఈ స్థూలదేహం నిలబడుతూవుంది. భరతం అంటే అగ్ని. స్థూల శరీరానికి సంబంధించిన అగ్ని విద్యే భారతం. అగ్ని మన దేశానికి అధిష్ఠాన దేవత కావటం వల్లనే యిది భారతదేశమయ్యింది. ''అగ్నిర్భూస్థానః'' అని శ్రుతి. భూలోక ప్రజల భరణ పోషణాలు నిర్వహించటంచేత అగ్నిని భరతుడన్నారు. ఇది వైదిక దర్శనం. పురాణేతిహాస దర్శనాలు వేరుగా వున్నా ''ఇతిహాస పురాణాభ్యాసం వేదం సముప బృంహయేత్'' కదా చరమ లక్ష్యం.

సర్వశాస్త్ర సార భూతం, జ్ఞాన విజ్ఞాన కోశమైన భారతం సర్వ మానవ మనః
ప్రవృత్తులకు ఆలవాలం. ప్రతి వ్యక్తి తన స్వ స్వరూపాన్ని తెలుసుకోటానికి భారతాన్ని
చదవాలి.

భారత భాగాలకు పర్వాలని పేరు. ''పిపర్తీతి పర్వన్'' (పృ-పాలన
పూరణయోః) అని నిరుక్తి. వస్తు రక్షాపూరకమైనది పర్వం. అగ్ని వలననే వస్తు రక్ష.
కాబట్టి 'పర్వ' శబ్దం అగ్నిత్రయీ వేదానికి చెందింది. వేదాలు అగ్నిపర్వాలు. భారతం
పంచమవేదం. కాబట్టి భారత భాగాలు పర్వాలయ్యాయి. వాటిలో ఇది విరాటపర్వం.
దేవుని విరాడుపాసనకు చెందిన రహస్య భావం కాబట్టి అజ్ఞాతవాసం ప్రధాన విషయం
అవుతుంది.

విరాట పర్వ సూక్తుల్ని శ్రీ వై. రామకృష్ణారావుగారు ఈ పుస్తక రూపంలో
మనకు అందిస్తున్నారు. ఇది సామాన్యమైన పరిశ్రమ కాదు. తత్త్వజ్ఞత, లోకజ్ఞత, మనోజ్ఞతల
అమృతాక్షర వాహినీ సంగమం ఈ గ్రంథం. రామకృష్ణారావు గారు ఆధ్యాత్మిక విద్యా
విషయ సంపన్నులు. నిరాడంబర జీవన మర్యాద నెఱిగిన అసాధారణ మేధా సంపన్నులు.
వారి ఆలోచనల్లో క్రొత్త వొరవడితో బాటు ప్రయోగ కుశలత కనిపిస్తుంది. ఆయన
మాటలన్నిటా ఆనందోపదేశాలు మలయమారుతాల్లా వీస్తూ వుంటాయి. ఉద్యోగ రీత్యా
వారికి నేను సహచరుణ్ని కావటం నా భాగ్య విశేషంగా భావిస్తూ సంస్కృతంలో
క్షేమేంద్రుని 'చారుచర్య' వంటి యీ 'విరాటభారతి' ని విద్వల్లోక విహారానికి పంపిస్తున్న
రామకృష్ణారావుగారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

''విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్.'' పూల సౌరభాన్ని వాయువు
వ్యాపించినట్టుగా, ఉత్తమ జనులై యీ రచనను లాలిస్తారని ఆశిస్తూ -

. 9.98 బుధజన విధేయుడు
హైదరాబాదు ఆచార్య తిరుమల.

# ధర్మోత్సాహం

మహాభారతం ''అష్టాదశపర్వ నిర్వహణ సంభృతమ్మై పెనుపొందినట్టిది''. మహాభారతంలోని ప్రతి పర్వంలోనూ సందర్భానుగుణంగా వివిధ ధర్మాలు ప్రవచించబడ్డాయి. అన్ని పర్వాలలోను విరాటపర్వం ఒక విశిష్టత కలిగినది. తిక్కన సోమయాజి చెప్పినట్లు విరాటపర్వం హృదయాహ్లాది, ఊర్జితకథోపేతము, నానారసాభ్యుదయోల్లాసి. అవాంతరమ్మైన ఉపాఖ్యానాలేవీ లేకుండా అచ్చమ్మైన భారతకథే రసవత్తరంగా సాగుతుంది. అయినా వ్యాసభగవానుడు సమయానుగుణంగా అనేక సూక్తులు ప్రవచించాడు. రసవత్తరమ్మైన, నాటకీయమ్మైన కథా బలం వలన ఈ పర్వంలోని సూక్తులపై అంతగా పండితుల, పాఠకుల దృష్టి ప్రసరింపబడలేదేమో! ఆ కారణంగా, ఈ సూక్తులు పాఠకలోకానికి అందించాలనే సంకల్పం కలిగింది. ఆ ప్రయత్న ఫలమే ఈ విరాటభారతి. కేవలం సూక్తుల్ని వ్యాఖ్యానించడమేగాక, తత్కథా సందర్భాన్ని కూడా పేర్కొనడం వల్ల పాఠకులు కథా సూత్రాన్ని అనుసరించి సాగిపోతూ, కేవలం సూక్తి పఠనం వల్ల కలిగే విసుగుదలను పొందక ఆసక్తితో పఠిస్తూ ఆనందించగలరని నా అభిప్రాయం.

ఆయా సూక్తుల్ని వ్యాఖ్యానించే సందర్భంగా, సమానమ్మైన సూక్తులను వాల్మీకి రామాయణం, చాణక్య రాజనీతి సూత్రాలు మొదలైన ఇతర గ్రంథాల నుండీ కూడా ఉల్లేఖించాను.

ఈ నా ప్రయత్నాన్ని ప్రోత్సహిస్తూ ముద్రణ నిమిత్తం ఆర్థిక సహాయం అందించిన తిరుమల తిరుపతి దేవస్థానంవారికి కృతజ్ఞతలు. స్ఫూర్తిమంతంగా ముఖపత్రాన్ని చిత్రించిన ఆప్తమిత్రులు, సుప్రసిద్ధవ్యంగ్య చిత్రకారులు శ్రీ 'పాప' గారికి ధన్యవాదాలు. పుస్తకానికి 'విరాటభారతి' అని పేరు సూచించి 'గుణధ్వని' చేసిన విద్వన్మిత్రులు, సుప్రసిద్ధకవివర్యులు కవికౌస్తుభ డా॥ ఆచార్య తిరుమల గారికి నమోవాకాలు. ముద్రణ విషయంలో బాధ్యత వహించి సహకరించిన చి॥ అవ్వారు రామకృష్ణకు ఆశీస్సులు. అందంగా పుస్తకాన్ని ముద్రించడంలో తోడ్పడిన మిత్రుడు శ్రీ వెంకటేశ్వర కోఆపరేటివ్ ప్రింటింగ్ ప్రెస్, హిమాయత్‌నగర్ అధినేత శ్రీ అశోక్‌రెడ్డికి అభినందనలు.

ఆశ్వయుజ మాసం
అక్టోబరు 1998

– ఎల్లాప్రగడ రామకృష్ణారావు
హైదరాబాదు.

"ఆనో భద్రాః క్రతవోయన్తు విశ్వతః"

అని ఋగ్వేదం. అన్ని దిక్కుల నుంచీ సద్భావనలు మాలో ప్రవేశించాలనే పరమమైన ఆకాంక్ష యిది. ప్రాచీన భారతీయ సాహిత్యమంతా, జన హృదయాలలోకి సద్భావనా పవనాలను ప్రసరించే పరమోద్దేశ్యంతో వెలువడినట్టిదే.

శ్రీమన్మహాభారతం పంచమవేదం. వేదాలలో ప్రభుసమ్మితంగా చెప్పబడిన ధర్మాలు మహాభారతేతిహాసంలో మిత్రసమ్మితంగా హృదయ సన్నిహితంగా అందించబడ్డాయి. సార్వకాలీనం, సార్వ జనీనం అయిన భారతం సమస్త మానవాళికి ఎదుట నిల్చిన నిలువుటద్దం.

ఈ మహేతిహాసాన్ని ప్రవచించింది –

ఈ అద్భుత శిల్పాన్ని గండరించింది –

ఈ ముకురాన్ని మానవాళి ముందు నిలిపింది – వేదవ్యాస భగవానుడు. వేదవ్యాసుణ్ణి భారతీయులు సాక్షాత్తు విష్ణు స్వరూపునిగా భావిస్తారు.

**వ్యాసాయ విష్ణు రూపాయ వ్యాసరూపాయ విష్ణవే**
**నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః**

వేదాలు విభజించి, పంచమవేదమైన భారతాన్ని, అష్టాదశ పురాణాలను ప్రపంచించి, బ్రహ్మసూత్రాలను ప్రవచించి భారతీయ సంస్కృతికే మూలమై నిల్చిన భగవత్స్వరూపుడు వేదవ్యాసుడు. వేదాలకు ఖిల సంహితలున్నట్లుగానే, పంచమవేదమైన మహాభారతానికి కూడా హరివంశం ఖిలం. ఖిలం అంటే తరువాతది, పరిశిష్టమైనది అని అర్థం.

"కృష్ణాదాగతః కార్ష్ణః" కృష్ణద్వైపాయనుడి రచనగాబట్టి 'కార్ష్ణం' అనబడుతోంది. వ్యాసుడు వ్రాసిన మూల గ్రంథం 'జయం' ఇందుకు మొదటి శ్లోకమే నిదర్శనం.

**నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్**
**దేవీం సరస్వతీం వ్యాసం తతోజయ ముదీరయేత్ ॥**

కాబట్టి వ్యాసుడు చెప్పింది 'జయం'.

శ్రీమన్నారాయణుడికి, నరోత్తముడైన అర్జునుడికి, వ్యాసభగవానుడికి నమస్కరించి తరువాత భారతాన్ని పఠించాలి. వ్యాసుడు విభజించిన వేదాలను అధ్యయనం చేసి అందించిన నలుగురు శిష్యులు – పైలుడు, వైశంపాయనుడు, సుమంతుడు, జైమిని. వైశంపాయనుడు జయ గ్రంథానికి ఉపఖ్యానాలు చేర్చాక అది భారతమయింది.

మహాభారతమనగానే అది భరత సంబంధమైన ఇతిహాసం అని తెలుస్తుంది.

★ భరత శబ్దం ఎవరెవ్వరియెడ ప్రయుక్తమయిందో గమనిస్తే – వేదకాలంలో 'భారత', 'కురు' శబ్దాలు ఋత్విక్ నామాలుగా యాస్కుడు పేర్కొన్నాడు. ''భారతాః 1. కురవః 2. ఋత్విక్ నామాని''.

భారత కురు శబ్దాన్ని యాస్కుడు ఋత్విక్ నామాలుగా చెప్పటంవల్ల గాబోలు, భారతయుద్ధం ఒక యజ్ఞంగా భావింపబడి ''చత్వారో వయ మృత్విజః'' అనే పోలిక చెప్పబడింది.

ప్రాచీన కాలంలో కౌరవ పాండవుల్ని కలిపి భరతులనేవారు. వాళ్ళ యుద్ధమే భారతయుద్ధం, దాన్ని వర్ణించిన గ్రంథమే మహాభారతమయింది.

మహాభారతంలో ఈయబడిన వంశావళుల్లో కొందరు భరతులు కనబడుతున్నారు.

శకుంతలాదుష్యంతుల పుత్రుడు భరతుడు.

అగ్ని వంశావళిలో శంయుని కుమారుడు భరతుడు. అతని సోదరి భారతి.

అద్భుతనాముడైన అగ్ని పుత్రుడు భరతుడు మరొకడు.

దశరథుని కుమారుల్లో కైక కుమారుడు భరతుడు.

---

★ ఈ వివరణను విద్యా భాషా ప్రవీణ డా॥ మూలంపల్లి చంద్రశేఖర శర్మగారి సిద్ధాంత గ్రంథం 'మహాభారతం- విశ్వవిజ్ఞానకోశం' నుండి గ్రహించాను. వారికి నా నమోవాకాలు ....

ఋగ్వేదంలో ''భారతాః'' అని సూర్యవంశ క్షత్రియుల పక్షంగా ఈ శబ్దం ప్రయోగింపబడింది. కాబట్టి ఋగ్వేదభారతులు, మహాభారత భారతులు భిన్నులే. ఈ విషయం వ్యాస భారతంకూడా పేర్కొన్నది.

'క,ట,ప,య' సూత్రాల ప్రకారం భారతానికి 'జయం' అనే పేరు చక్కగా అమరుతుంది. 'కటపయ' సూత్రమంటే ఏమిటో ముందు తెలుసుకుందాం.

కాదయో ఉ కాష్టాదయోం ఉ కాః పాద్యాః పంచప్రకీర్తితాః

యాదయో ఉ ష్టౌ ఞ నౌపూర్ణే విజ్ఞేయాః సర్వశాస్త్రకే

క నుండి హ వరకు గల హల్లులకు ఒక్కొక్క సంఖ్య కేటాయించబడింది. క నుండి ఝ వరకు గల హల్లులకు 1 నుండి 9 అంకెలు.

క–1, ఖ–2, గ–3, ఘ–4, ఙ–5, చ–6, ఛ–7, జ–8, ఝ–9,

అలాగే ట నుం డి ధ వరకు 1 నుండి 9.

ట–1, ఠ–2, డ–3, ఢ–4, ణ–5, త–6, థ–7, ద–8, ధ–9.

ప నుండి మ వరకు 1 నుండి 5

ప–1, ఫ–2, బ–3, భ–4, మ–5,

య నుండి హ వరకు 1 నుండి 8

య–1, ర–2, ల–3, వ–4, శ–5, ష–6, స–7, హ–8

ఞ, న లకు సున్నాలు.

జయం అన్నప్పుడు జ–8, య–1,

జయ - 81 – సంస్కృతంలో అంకెలు ఎడం వైపు త్రిప్పుకోవాలి. అపుడు 18 అవుతుంది. 18 ఎంతో ప్రాముఖ్యం గల సంఖ్య. ఇందులోని విడి విడి అంకెల్ని (1,8) కలిపితే 9 అవుతుంది. సంఖ్యాశాస్త్రం ప్రకారం తొమ్మిది సర్వప్రశస్తమైనది. భారతమంతా ఈ 18 మీదనే నడిచింది.

మహాభారతంలోని ప్రధాన పర్వాలు - 18

కురుక్షేత్ర యుద్ధం జరిగిన దినాలు - 18

పాల్గొన్న అక్షౌహిణుల సంఖ్య - 18 (11-కౌరవులు, 7-పాండవులు)

భగవద్గీతలోని అధ్యాయాలు - 18

యుద్ధానంతరం ధర్మరాజు పాలనం చేసిన కాలం, ధృతరాష్ట్రుడు జీవించిన కాలం కూడా 18 సంవత్సరాలేనట!

మహాభారతం విశ్వ విజ్ఞాన భాండాగారం. ఈ అర్థాన్నే వ్యాసుడు స్పష్టంగా పేర్కొన్నాడు.

**ధర్మేచార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ!**
**యది హాస్తి తదన్యత్ర యన్నే హాస్తి నతత్క్వచిత్!**

ఈ అభిప్రాయాన్నే నన్నయ ''ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని...'' అనే సీస పద్యంలో విస్తరించి వివరించాడు. భారతంలో చెప్పబడని ధర్మాలు లోకంలో ఎక్కడా లేవు. లోకంలో చెప్పబడిన ధర్మాలన్నీ భారతంలో ఉండనే ఉన్నాయి.

భాగవతారంభంలో పోతన 'శ్రీకైవల్యపదంబుచేరుటకునై చింతించెదన్' అన్నాడు. భాగవతమే కాదు, భారతం కూడా మోక్ష ప్రదమే. తిక్కన సోమయాజి భారతం చివర్లో - స్వర్గారోహణ పర్వం పూర్తయిన తర్వాత ఫలశ్రుతిలో ఈ ఇతిహాస రత్నాన్ని వింటే పాపాలు తొలగిపోతాయని, స్వర్గం లభిస్తుందనీ, మోక్షం ప్రాప్తిస్తుందనీ పేర్కొన్నాడు. అంతేకాదు మరెన్నో సత్ఫలితాలు కలుగుతాయనవి వక్కాణించాడు.

వ్యాసభగవానుడు విరాటపర్వాంతంలో శ్రవణ మహిమను పేర్కొంటూ మోక్షం లభిస్తుందని చెప్పాడు.

**శ్రుత్వాతు చరితంపుణ్యమ్ పార్థివానాం మహాత్మనామ్**
**నాధివ్యాధి భయంతేషాం జాయత్ పుణ్య కర్మణామ్.**

మహాత్ములైన పాండవుల పుణ్య చరితాన్ని విన్న పుణ్యాత్ములకు మనోదేహ బాధలు కలుగవు.

**దుర్గతే స్తరణేతేషా మాయతం తరణం భవేత్**
**సుభిక్షం క్షేమమారోగ్యం పుణ్యవృద్ధి : ప్రజాయతీ**

ఈ పుణ్య చరిత్ర, విన్నవాళ్ళకు దుర్గతులను దాటేందుకు నావలాగా ఉపకరిస్తుంది. సమృద్ధి, క్షేమం, ఆరోగ్యం, పుణ్యోన్నతి అనే ఫలాలు లభిస్తాయి.

**సర్వ పాపాని నశ్యన్తి జాయన్తే సర్వసంపద :**
**ఏకాకి విజయేచ్ఛత్రూన్ స్మృత్వా ఫాల్గున కర్మచ**

అర్జునుడి పరాక్రమ కార్యాలను స్మరించిన వ్యక్తి అసహాయ శూరుడై ఒక్కడే శత్రువుల్ని జయిస్తాడు. అతని పాపాలన్నీ నశించి సర్వ సంపదలూ కలుగుతాయి.

**ఈతయః సంప్రణశ్యన్తి నవియోగః ప్రియే జనే**

ఈతి బాధలు తొలగిపోతాయి. ఇష్ట జనులతో ఎడబాటు కలుగదు.

ఈతి బాధలు ఆరు – అతివృష్టిరనావృష్టిర్మూషికాశ్శలభాశ్శుకాం
అత్యాసన్నాశ్చ రాజానష్షడేతా ఈతయః స్మృతాః

అతివృష్టి, అనావృష్టి, ఎలుకలు, మిడుతలు, చిలుకలు, రాజ్యానికి మిక్కిలి సమీపంలో ఉన్న (పొరుగు) రాజు, ఇవి ఈతి బాధలు ...

అభీప్సిత సిద్ధి, పుణ్యమోక్షలబ్ధి కేవలం పుణ్యాత్ములైన పాండవుల చరిత్రను ఆకర్ణించడంవల్ల మాత్రమే గాదు, ఈ పంచమ వేదంలో ఎన్నెన్నో వైదిక ధర్మాలు నిరూపితమై ఉండటం వల్ల కూడా.

వ్యాసుడు సూక్తిభాసుడు. భారతమంతా ఈ సూక్తి ప్రకాశం పరివ్యాప్తమై, మార్గదర్శకమై ఉంటుంది. పరాఙ్ముఖులై కళ్ళు మూసుకొనే కలుషాంధులకు తప్ప – అందరికీ జ్ఞాన, వైరాగ్య,

మోక్షమార్గాన్ని, సత్ప్రవర్తనను, కర్తవ్యాన్ని నిర్దేశిస్తుంది భారతం. ఉపనిషత్సారమైన భగవద్గీతను గర్భీకరించుకొన్న మహేతిహాసం గదా ఇది!

మన పురాణ వాఙ్మయంలో ధర్మాలు తెలియని పాత్రలు ఏమున్నాయి? రామాయణంలో కుంభకర్ణుడు కూడా తనను నిద్ర మేల్కొలిపి యుద్ధానికి సిద్ధం కమ్మనిన రావణుడికి ఎన్నో ధర్మాలు వక్కాణించాడు. మహాగ్రంథనిర్మాతలైన ఆ మహర్షుల ముఖ్యోద్దేశ్యం ఉపదేశమే. నన్నయ భట్టారకుడు కూడా భారతాన్ని జగద్ధితం కోసమే రచిస్తున్నానన్నాడు. పోతనామాత్యుడు కూడా ''సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పెనీ- బమ్మెరపోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్'' అన్నాడు. నన్నయ రుచిరార్థ సూక్తి నిధినని ఆదిపర్వం అవతారికలో ప్రథమ పురుషలో పేర్కొన్నాడు. ముందే పేర్కొన్నట్లు మహాభారతం ఆద్యంతం సూక్తి భాసురమై పరిఢ విల్లే గ్రంథమే. అయితే అన్యపర్వాలలోవలె అవాంతరమైన ఉపాఖ్యానాలేవీ అడ్డు తగలని అచ్చమైన భారత కథ విరాటపర్వం.

తిక్కన, విరాటపర్వం గురించి హృదయాహ్లాది, ఊర్జిత కథోపేతంబు, నానా రసాభ్యుదయోల్లాసి అని పేర్కొన్నాడు. బిగువైన కథతో, విభిన్నమైన, ఉత్కంఠాజనకమైన సన్నివేశాలతో సాగిపోయే విరాటపర్వంలో కూడా ధర్మ, నీతి బోధకు సముచితమైన అవకాశం కల్పించడం వ్యాస భగవానుడి ధర్మోత్సాహానికి నిదర్శనం.

విరాటపర్వానికి మరో ప్రాముఖ్యం ఉన్నది. భారతాన్ని ఆసాంతం పారాయణం చేయడానికి సంకల్పించుకొన్నవారు ముందుగా విరాట పర్వంతో ప్రారంభించాలనే సాంప్రదాయకమైన నియమం ఉన్నదిట. అలాగే రోదనామయం, విషాదభూయిష్ఠమైన స్త్రీ పర్వం యింటిలో ఉంచుకోగూడదు అనే నిషేధమూ వినిపిస్తుంటుంది లోకంలో.

వ్యాసభగవానుడి విరాటపర్వంలోని సూక్తిసుధను ఆస్వాదించే ముందు, సూక్తి శబ్ద విచార చర్చను, కొంచెం పరిశీలిద్దాం. 'సుష్ఠు ఉక్తిః సూక్తి' అని నైఘంటికార్థం. చక్కటి మాట,

మంచిమాట ఏదైనా సూక్తే, అది నీతి ధర్మ బోధ మాత్రమే కానక్కరలేదు. హృదయాహ్లాదియై కవితాత్మకమైన వాక్కు సూక్తే అవుతుంది.

'మధురావిజయం' లో గంగాదేవి తిక్కన కవిత్వాన్ని గూర్చి

**" తిక్కయజ్వ కవేః సూక్తిః కౌముదీవ కళానిధే**

**సతృష్ణైః కవిభిః స్వైరం చకోరైరివ సేవ్యతే"**

అని ప్రశంసించింది. తిక్కన కవి సూక్తులు చంద్రుని వెన్నెల వంటివి. రస తృష్ణాపరులైన కవులు ఆ కవితా కౌముదిని చకోరాలవలె ఆస్వాదిస్తారు. ఈ సందర్భంలో సూక్తి అంటే గంగాదేవి ఉద్దేశ్యం నీతిబోధ అనికాదు. రాజశేఖరుడు కావ్యమీమాంసలో లాటదేశం గురించి చెబుతూ...

**"సూక్తీనాం స్మరకేళీనాం కలానాంచ విలాస భూః**

**ప్రభుదేవీ కవిర్లాటీ తద్గాపి హృది తిష్ఠతి"** అని చెప్పాడు.

లాటదేశం సూక్తులకు, మదన క్రీడలకు, కళలకు విలాసభూమిట ఇక్కడ సూక్తులు అంటే దర్మపన్నాలు అని భావం కాదు, కవిత్వమనే. అలాగే రాజశేఖరుడు తన విద్ధసాలభంజికలో కృష్ణ శంకర శర్మ తనను ప్రశంసించిన వైనాన్నిలా పేర్కొన్నాడు :

**"పాత్రుం శ్రోత్రరసాయనం రచయితుం వాచస్సతాం సమ్మతాః**

**వ్యుత్పత్తిం పరమా మవాప్తు మవధిం లబ్ధుం రస స్రోతసః**

**భోక్తుం స్వాదుఫలంచ జీవిత తరోర్యద్యస్తితే కౌతుకం**

**తద్భ్రాతః! శృణు రాజశేఖర కవేః సూక్తి : సుధాస్యందినీ"**

జీవిత సాఫల్యం కోసం అమృతం చిందే రాజశేఖర కవి సూక్తుల్ని వినుమన్నాడు.

సూక్తి అన్నప్పుడు కేవలం నీతిబోధ అని మాత్రమేగాక చక్కని మాట, మంచి పలుకు అనే విధంగా భావిస్తే – కవితాత్మకమైన వ్యాసుని భారతం సర్వత్ర సూక్తి విభాసితమే.

వ్యాసుడు శుష్క పౌరాణికుడు కాదు.

''విద్వత్ సంస్తవనీయ భవ్య కవితావేశుండు''.

ఈ శబ్ద విచార చర్చ అటుంచితే, లోకంలో 'సూక్తి' అంటే నీతి వాక్యం ధర్మ బోధ అనే రూఢి ప్రస్తుతం ఏర్పడి ఉన్నది. కాబట్టి ఆ రూఢి ననుసరించి సంస్కృత విరాటపర్వంలో వివిధ సందర్భాల్లో ప్రవచింపబడిన విభిన్న ధర్మాల వివరణ ఈ గ్రంథ రచనా ప్రయత్నం.

మహాభారతం కల్పవృక్షం. అనంతర కాలంలో ఎన్నో కావ్య, నాటకాలకు ఇతివృత్తాన్ని సమకూర్చిన పెన్నిధి భారతం. అటువంటి బృహదేతిహాస నిర్మాత వ్యాసభగవానుడు 'భువనోప జీవ్యుడు.'

క్షేమేంద్రుడు కవి కంఠాభరణంలో ....

ఛాయోప జీవీ పదకోపజీవీ – పాదోపజీవీ సకలోపజీవీ

భవేదథ ప్రాప్త కవిత్వ జీవీ – స్వోన్మేషతోవా భువనోపజీవ్యః

అని పేర్కొన్నాడు. కవులు ఛాయోపజీవి, పదకోపజీవి, పాదోపజీవి, సకలోపజీవి అని నాలుగు విధాలు. కవి అనంతరకాలంలో సాధించిన స్వీయ కవిత్వాన్నే ఆధారంగా గొనేవాడై, స్వీయ ప్రతిభా విశేషం చేత భువనోపజీవ్యుడవుతాడు.

పూర్వకవుల కవిత్వచ్ఛాయలను స్వీకరించి కవిత్వం చెప్పేవాడు ఛాయోపజీవి. పూర్వకవుల శ్లోకాలలోని కొన్ని పదాలు గ్రహించి కవిత్వం చెప్పేవాడు పదకోపజీవి. పాదాలు గ్రహించేవాడు పాదోపజీవి. పదాలను, అర్థచ్ఛాయను కూడా ప్రాచీన కవుల నుండీ గ్రహించేవాడు సకలోప జీవి. ఛాయోప జీవిత్వాదులు లేకుండా, స్వప్రతిభా విశేషంతో కవిత్వం చెప్పదలిచినవారంతా ఇతడిపై ఆధారపడి ఉంటారు. ఇతరుల మీద ఆధారపడి జీవించేవాడు ఉపజీవ్యుడు.

'భువనోప జీవ్యోయథాభగవాన్ వ్యాసః తథాచోక్తమ్.'

'ఇదం కవి వరైః సర్వైరాఖ్యానమోప జీవ్యతే

ఉదయం ప్రేప్సు భిర్భృత్యైరభి జాత ఇవేశ్వరః'

భువనోప జీవ్యుడైన కవికి ఉదాహరణ వ్యాస భగవానుడు. అభివృద్ధిని పొందగోరే భృత్యులు ఉత్తమ సంజాతుడైన సత్ప్రభువును సేవించినట్లు, ఈ భారతాఖ్యానాన్ని కవివరులంతా సేవించి లాభం పొందుతారు – అని క్షేమేంద్రుని వివరణ.

# పాండవ ప్రవేశపర్వం – రెండవ అధ్యాయం

పాండవులు పన్నెండు సంవత్సరాల అరణ్యవాసం పూర్తి జేశారు. ఇక 'పదమూడగు నేడు' అజ్ఞాతవాసం చేయాలి. విరటుని రాజ్యంలో యుధిష్ఠిరుడు కంకుభట్టనే పేరుతో సభికుడై వర్తిస్తానన్నాడు. భీముడు ★ వల్లవుడనే పేర వంటలవానిగా చేరతానన్నాడు. మరి అర్జునుడి సంగతేమిటి? ఈ సందర్భంగా ధర్మరాజు అర్జునుడి బలపరాక్రమాలను మననం చేసుకుంటూ, లోకంలో ఏయే జాతుల్లో ఏవి ఉత్తమమైనవో పేర్కొన్నాడు.

నరశ్రేష్ఠుడు, బలవంతుడు అయిన అర్జునుడు సర్పాలని, రాక్షసుల్ని సంహరించి ఖాండవ వనాన్ని దహించి అగ్నిని తృప్తి పరచాడు. వాసుకి చెల్లెలు ఉలూచిని వివాహమాడిన యోధశ్రేష్ఠుడు అతడు. అట్టి కౌంతేయుడు విరాట నగరంలో ఎట్టి సేవ చేయగలడు? ప్రతాపవంతుల్లో సూర్యుడు శ్రేష్ఠుడు. మానవుల్లో బ్రాహ్మణుడు శ్రేష్ఠుడు. సరీసృపాల్లో పాము గొప్పది. తేజోవంతుల్లో అగ్ని శ్రేష్ఠుడు. ఆయుధాల్లో వజ్రం, గోవుల్లో వృషభం, జలాశయాల్లో సాగరం, వర్షించే వానిలో పర్జన్యుడు అధికులు.

**'ధృతరాష్ట్రశ్చ నాగానాం హస్తిష్వైరావణో వరః**

**పుత్రః ప్రియాణమధికో భార్యాచ సుహృదం వరా' – 17**

---

★ సంస్కృత భారతంలో వంటలవానిగా చేరిన భీముని పేరు వల్లవుడనే ఉంది. తెలుగులో మాత్రం తిక్కన 'వలలుడు' అన్నాడు.

సర్పాల్లో ధృతరాష్ట్రుడు, ఏనుగుల్లో ఐరావతం మిన్నయైనవి. ప్రియమైన వారిలో పుత్రుడు అధికుడు – అన్నాడు ధర్మరాజు. ఆదిపర్వంలో దుష్యంతోపాఖ్యానంలో శకుంతల దుష్యంతుడితో కర్పూరం, చందనం, వెన్నెల మొదలైనవేవీ పుత్రగాత్ర పరిష్వంగ సుఖం కంటే గొప్పవీ, హృద్యమైనవీ కాదు అని వక్కాణించింది. అలాగే చెలిమికల వారిలో భార్యేమిన్న అని కూడా అన్నాడు ధర్మరాజు.

**భార్యను ....** కార్యేషుదాసీ కరణేషుమంత్రీ
భోజ్యేషుమాతా శయనే షురంభా
క్షమయా ధరిత్రీ ..... ఇత్యాదిగా వర్ణించడం

లోక విదితం. భారతం, స్నేహవంతుల్లో భార్యను మించిన వారు లేరని, అంటే భార్య 'నెచ్చెలి' అంటూ ఆమె ఔన్నత్యంలో మరో కోణాన్ని దర్శింపజేసింది.

## మూడవ అధ్యాయం

యుధిష్ఠిరుడు విరటుని రాజ్యంలో ద్రౌపది ఎలా సంచరించగలదో గదా అని వితర్కించుకొనే సందర్భంలో ఇలా అంటాడు.

**'ఇయంహి నః ప్రియంభార్యా ప్రాణేభ్యో ఽ పి గరీయసీ**
**మాతేవ పరిపాల్యాచ పూజ్యా జ్యేష్ఠేవ చ స్వసా' – 14**

ఈ ద్రౌపది మనకు ప్రియమైన ఇల్లాలు, ప్రాణాలకంటే మిన్నైనది. తల్లి మాదిరి పరిరక్షింపదగినది; అక్కవలె గౌరవించ దగినది.

భార్య పిల్లల్ని కనే యంత్రం కాదు; వండి వార్చే వంటలక్క గాదు. ఆమె – తల్లి, అక్క, నెచ్చెలి, ప్రాణాధికురాలు. అంతేకాదు 'ఇయంగేహే లక్ష్మీ' అన్నారు. 'ఇంటికి దీపం ఇల్లాలే' అన్నారు తెలుగువారు. 'గౌరవంబునకేక కారణంబు' అన్నాడు నన్నయ – దుష్యంతోపాఖ్యానంలో.

ఆదిపర్వంలో బకాసురుడికి తాను ఆహారంగా వెళతానన్న బ్రాహ్మణునికి అతని భార్య ఒక ధర్మాన్ని చెబుతుంది. ఈ శ్లోకాన్ని నన్నయ తెనిగించలేదు. వ్యాసుడు బ్రాహ్మణి నోట పలికించిన సూక్తి యిది.

'ఆపదర్థం ధనం రక్షేత్ దారాన్ రక్షేత్ ధనైరపి
ఆత్మానం సతతం రక్షే దారైరపి ధనైరపి'

ఆపదల్లో ఆదుకొనే నిమిత్తం ధనాన్ని రక్షించుకోవాలి. ధనం కంటే కూడా భార్యను రక్షించుకోవాలి.

మొదటి రెండు పాదాల్లో చెప్పిన ఈ సూక్తి భార్యను మించిన ధనం లేదని వక్కాణిస్తున్నది.

తరువాతి పాదాలు ప్రస్తుత సందర్భానికి విషయాంతరాలయినా ఆ ధర్మాన్ని పూర్తిగా తెలుసుకోవాలి గదా ...!

ధనం, భార్య - ఈ రెంటికంటే ముఖ్యంగా పురుషుడు తనను తాను రక్షించుకోవాలి. అందువల్ల బ్రాహ్మణి తానే బకాసురుడికి భోజనంగా అర్పితమవుతానంటుంది.

ధనం-భార్య- ఈ రెంటికంటే పురుషుడు తనను తానెందుకు రక్షించుకోవాలి? ధర్మ సాధన కోసమే!

''శరీర మాద్యం ఖలు ధర్మ సాధనమ్'' అంటే ఏ ధర్మాన్ని సాధించాలన్నా మొట్ట మొదటిది శరీరమే. దీన్ని నిలుపుకోవాలి. ఈ మాట కాళిదాసు కుమార సంభవంలో తపః కృశాంగియైన పార్వతితో కపట వటుడై వచ్చిన శివుడంటాడు. అంతకు మునుపే స్కాందపురాణాంతర్గతమైన మాఘ పురాణంలోనే ఈ సూక్తి కనిపిస్తుంది. గౌతముడు లేగరథుడనే రాజుతో మాఘస్నానం చేయమని చెపితే, ఆ రాజు చలికి తట్టుకోలేను, కాబట్టి స్నానం చేయలేనని చెబుతూ -

'వినశ్యమాన దేహేతు దేహీ ధర్మార్జనమ్ కథం
స్నానస్య కరణీ బ్రహ్మన్ తస్మాన్నాహం ప్రవర్తయే'

దేహం నశించిన తర్వాత దేహి ధర్మాచరణం ఎలా సల్పుతాడు. అందువల్ల నేను స్నానవిధిని ప్రవర్తించే వాణ్ణి గాదు సుమా అంటాడు.

భార్య ప్రాశస్త్యాన్ని, ప్రాముఖ్యాన్నీ శాస్త్రాలు అనేక విధాలుగా ప్రశంసించాయి.

**'న భార్యాయమా : పరంసుఖమ్'**

**'నాస్తి భార్యా సమం మిత్రమ్'**

**పుత్రపౌత్ర వధూభృత్యైః సంపూర్ణమపి సర్వదా**

**భార్యాహీన గృహస్థస్య శూన్యమేవ గృహంమతమ్**

అంటే పుత్ర పౌత్ర సేవకాది జనులెందరున్నా, భార్యలేని గృహం శూన్యం అని అర్థం.

అష్ట కష్టాల్లో భార్యావిహీనత కూడా ఒకటి. దాస్యం, దారిద్ర్యం, భార్యా విహీనత, స్వయంకృషి, యాచనం, అడిగితే లేదనటం, ఋణం, త్రోవలో నడవటం – ఇవి అష్టకష్టాలు.

జూదంలో సర్వస్వం కోల్పోయిన నల మహారాజుతో దమయంతి ఒక సందర్భంలో ఇలా అంటుంది భారతంలో –

**అధిక దుఃఖరోగార్తున కౌషధంబు**

**సురుచిరంబుగ భార్యయె చూవె యొందు**

**నొవర భార్యాసమేతుడై యున్నవాని**

**కెంతలయ్యును నాపద లెరుకపడవు**

**అలసినెడ డస్సి నెడనా –**

**కలి దప్పియునైన యెడల గడుకొని ధరణీ**

**తలనాథ! పురుషునకు ని–**

**మ్ముల భార్యయ పాచు చిత్తమున దుఃఖంబుల్**

(ఆంధ్ర మహాభారతం – ఆదిపర్వం – తృతీయాశ్వాసం)

దుష్యంతుడితో శకుంతల భార్య ప్రావముఖ్యాన్ని విశదంగా ఉపన్యసిస్తుంది దుష్యంతోపాఖ్యానంలో.

ఏదైనా, భార్య అనే కాదు స్త్రీ పూజనీయురాలు అనేది మన సిద్ధాంతం, మన జాతి మహోన్నత సంస్కారం. చాణక్యుడు రాజనీతి సూత్రాల్లో (రాజనీతి సూత్రాణి) ''నస్త్రీ రత్నమ్ సమం రత్నమ్'' అన్నాడు. స్త్రీ రత్నం వంటి రత్నం లేనేలేదని అభిప్రాయం. చాణక్యుడే మరో సందర్భంలో ''అలోహమయం నిగళం కళత్రమ్'' అని కూడా అన్నాడు. అంటే భార్య లోహంతో చేయని సంకెలట! ఇది విరక్తుల విషయమై వుండవచ్చు.

**''యత్ర నార్యాస్తు పూజ్యంతే**

**తత్ర రమంతే దేవతాః''**

అని కంఠోక్తిగా ప్రవచించిన సంస్కార సంపన్నత మనది.

# నాలుగవ అధ్యాయం

పాండవులు విరటుని రాజ్యంలో ఎవరెవరు ఏ తీరున ప్రవర్తించాలో నిర్ణయించుకొని తమ వెంటనున్న వారందరినీ పంపించిచేసి, ధౌమ్యుడు ''ఓ ధర్మరాజా! మీరు బ్రాహ్మణుల విషయంలో, స్నేహితులు, యుద్ధం అగ్నుల విషయంలో చేయదగినదంతా చక్కగా ఆచరించారు. అయితే, నీవు, అర్జునుడు ద్రౌపదిని మిక్కిలి జాగరూకతతో రక్షించుకోవాలి సుమా! ''మీకు ఈలోకం తీరు తెలియని దేముంది?'' అని హెచ్చరించాడు. చాణక్యుడు రాజనీతి సూత్రాల్లో ''అప్రమత్తోదారాన్ నిరీక్షేత'' అన్నాడు. అంటే భార్యను జాగరూకతతో కనిపెట్టుకొని ఉండాలి అని అర్థం. ఆ తరువాత ధౌమ్యుడిలా అన్నాడు.

**'విదితే చాపి వక్తవ్యం సుహృద్భిరనురాగతః**

**ఏష ధర్మశ్చ కామశ్చ అర్థశ్చైవ సనాతనః'**

ఎదుటి వాడికి అన్నీ తెలిసే ఉండవచ్చు. అయినా స్నేహభావం కలవారు అనురాగంతో మళ్ళీ మళ్ళీ చెప్పవలసిందే. ఇలా చెప్పడం వల్ల సనాతన ధర్మం, కామం, అర్థం అనుసరించి వస్తాయి.

ప్రేమ, స్నేహం, వాత్సల్యం ఉన్నప్పుడే మరీ మరీ జాగ్రత్తలు చెప్పడం జరుగుతుంది. ''ఆరోగ్యం జాగ్రత్త'' అనీ, ''సామాన్లు జాగ్రత్త'' అనీ ఎన్నో విధాల చెప్తుంటాము మనవాళ్ళకి. తమ ఆరోగ్యం గురించి వారికి తెలియదా? తమ వస్తువులు దొంగలబారిన పడకుండా కాపాడుకోవాలని వారికుండదా? అయినా చెప్పక తప్పదు. ధర్మజునికి తన భార్యను రక్షించుకోవాలని తెలియదా? అయినా చెప్పక తప్పదు. స్నేహం కలవాడు చెప్పవలసిందేనని ధౌముడి అభిప్రాయం.

అరణ్యపర్వంలో ధౌమ్యుడు ధర్మజునికి రామాయణం వినిపిస్తాడు. అప్పటి వరకు ధర్మజునికి అంత ప్రసిద్ధ గాథ తెలియదనుకోవాలా! అలా చెప్పటం ప్రేమాభిమానాలు గలవారినైజం. తెలిసినవాడికైనా సరే అలా చెబుతుంటే సనాతన ధర్మార్థ కామాదులు మరుగునపడకుండా జనసామాన్యంలో తరాలను అధిగమించి జీవిస్తుంటాయి. ఆ ధర్మాల అస్తిత్వానికి పునః పునర్బోధ అవసరమే మరి.

పాండవులు ప్రభువులు. కానీ విధివశాన వారు మరొక రాజు కొలువులో తలదాచుకొనవలసి వచ్చింది. అందుకని ధౌమ్యుడు రాజులకడ ''దుర్వసంచైవ కౌరవ్య! జానతారాజవేశ్మని''– ఎంత తెలిసినవాడికి కూడా రాజనివాసంలో మసలుకోవడం సులభం కాదు.

**'దృష్టద్వారో లభేత్ ద్రష్టుం రాజస్వేషు న విశ్వసేత్**
**తదేవాసన మన్విచ్ఛేద్ యత్రనాభి పతేత్ పరః' – 13**

ఎప్పుడైనాసరే రాజదర్శనాన్ని ద్వారపాలకుని వలననే చేయాలి. అంటే అతని ద్వారా కబురుపంపి అనుమతితో దర్శించాలి. రాజు ఇచ్చే ధనం విషయంలో నమ్మకం

పెట్టుకోకూడదు. శత్రువు వచ్చి పడనటువంటి ఆసనాన్నే ఆశించాలి.

**'యో నయానం న పర్యంకం నపీఠం నగజం రథమ్**

**ఆరోహేత్ సమ్మతో ఽ స్మీతి సరాజవసతిం వసేత్' - 14**

ప్రభువుకు తాను ప్రీతి పాత్రుణ్ణనే అహంకారంతో అన్యుల వాహనాన్ని, శయ్యను, పీఠాన్ని, గజాన్ని, రథాన్ని ఆరోహించతగదు. అటువంటివాడే రాజవేశ్మంలో వసించగలడు.

**'యత్ర యత్రైన మాసీనం శంకేరన్ దుష్టచారిణం**

**నతత్రోపవిశేద్ యోవై సరాజ వసతిం వసేత్' - 15**

ఏఏ తావేల్లో కూర్చుంటే దుష్టులైన చారులకు అనుమానం కలుగుతుందో, అక్కడ చేరకుండా ఉన్నవాడే రాజనివాసంలో వసించగల్గుతాడు.

**'నచాను శిష్యాద్ రాజాన మపృచ్ఛన్తం కదాచన**

**తూష్ణీం త్వేన ముపాసీత కాలేసమభి పూజయేత్' - 16**

అడగకుండా రాజుకు ఆలోచన చెప్పకూడదు. తనమానాన తను ప్రభువును సేవిస్తూ సమయానుగుణంగా అతణ్ణి ప్రస్తుతించాలి.

**'అసూయాన్తి హి రాజానో జనా నవృత వాదినః**

**తథైవ చావ మన్యంతే మంత్రిణం వాదినం మృషా' - 17**

అసూయాపరులై మెరమెచ్చుపుటబద్ధాలాడే వారంటే రాజులకు గిట్టదు. మృషల్పలుక మంత్రిని కూడా ప్రభువులు అవమానిస్తారు.

**'నైషాం దారేషు కుర్వీత మైత్రీం ప్రాజ్ఞః కదాచన**

**అంతఃపుర చరాయేచ ద్వేష్టియా న హితాశ్చయే' - 18**

రాజుల భార్యలతో, అంతఃపుర జనులతో, రాజు ద్వేషించేవారితో వివేకవంతుడెప్పుడు స్నేహం చేయరాదు. 'రాజదాసీ నసేవితవ్యా' అనే విధంగా, చాణుక్యుని రాజనీతి సూత్రాల్ల

కూడా ఇలాంటి హెచ్చరిక కనిపిస్తుంది.

రాజుదాసితో లేక రాజుకి సంబంధించిన వేశ్యాదులతో సంబంధం పెట్టుకొనరాదు అని చాణుక్యుని సూత్రం. రాజుకి సంబంధించిన ఏ స్త్రీతోనైనా చనువు ప్రమాదకారి అని పర్యవసితార్థం.

**'గచ్ఛన్నపి పరాంభూమి మపృష్టోహ్యనియోజితః**
**జాత్యంధ ఇవ మన్యేత మర్యాదా మనుచింతయన్' - 20**

తానెంత పెద్ద స్థానం పొందినా, రాజు పలకక ముందు మర్యాదను పాటిస్తూ, తానేమీ తెలియని వాడినని, జను షాంధుడినని అనుకొని ప్రవర్తించాలి.

చాలా మందికి ఒక బలహీనత ఉంటుంది. పెద్దవారేదైనా చెబుతుంటే, ఆ విషయం తనకు ముందే తెలిసి ఉంటే, తామే ముందు చెప్పేందుకు తొందరపడతారు. మాటకు అడ్డువస్తూ కల్పించుకొని, ఆ విషయం తనకు ఎప్పుడో తెలుసుననే సంగతి వ్యక్తం చేయాలనుకొంటారు. అది మంచి పద్ధతి కాదు. పెద్దలు - వారు అధికారులే కావచ్చు, గురువులే కావచ్చు, ఏదైనా చెబుతుంటే, తనకు ముందే తెలిసి ఉన్నా, తెలియని వాడినలె ఉండి, ఆ విషయం ఆ పెద్దలవలననే తాను అప్పుడే తెలుసుకున్నట్లు ప్రవర్తిస్తే పెద్దల గౌరవం నిలిపినట్లవుతుంది. పెద్దలముందు సర్వజ్ఞత్వం ప్రకటించకూడదు.

**నహి పుత్రం న సప్తారం న భ్రాతర మరిందమాః**
**సమతి క్రాంత మర్యాదం పూజయంతి నరాధిపాః - 21**

శత్రుదమనులైన ప్రభువులు, మర్యాదనతిక్రమిస్తే వాడు పుత్రుడైనా, సోదరుడైనా, మనుమడైనా మరింకెవడైనా సరే, వాణ్ణి మన్నించరు.

**యత్నాచ్చోపచరేదేన మగ్నివత్ దేవవత్త్విహ**
**అనృతేనోప చీర్ణోహి హన్యాదేవ నసంశయః - 22**

రాజు సేవలో చాలా జాగ్రత్తగా మెలగాలి. అగ్నిని, దైవాన్ని సేవించినంత అప్రమత్తత వహించాలి. కపట బుద్ధితో చేరే భృత్యుణ్ణి రాజు అంత మొందిస్తాడు. ఇందులో సందేహం లేదు.

రాజుల సేవ కత్తిమీద సాము వంటిది. చాణక్యుడు రాజనీతి సూత్రాల్లో ' అగ్నివద్రాజాన మాశ్రయేత్' అంటాడు. అంటే అగ్నిని ఆశ్రయించినట్లు రాజును ఆశ్రయించాలి. నిప్పుతో వ్యవహరించినట్లు వ్యవహరించాలి.

**'యద్యద్ భర్తాను యుంజేత తత్తదేవాను వర్తయేత్**
**ప్రవాద మవలేపంచ కోపంచ పరివర్జయేత్' – 23**

ప్రభువు శాసించిన పనినే చేయాలి. పరాకు, గర్వం, కోపం వదలి పెట్టాలి.

**సమర్థవాసు సర్వాసు హితంచ ప్రియమేవచ**
**సంవర్ణయేత్ తదేవాస్య ప్రియాదపి హితం భవేత్ – 24**

రాజుకు ప్రియమైన, హితమైన వాటినే సలహా యివ్వాలి. అలా వీలు పడకపోతే ప్రియాన్ని వదలి హితాన్ని సూచించాలి.

సర్వకార్యాల్లోనూ, వాక్కుల్లోనూ ప్రభువుకు అనుకూలుడై ఉండాలి. ప్రియము, హితము కాని దానిని చెప్పకూడదు.

**నాహ మస్య ప్రియో ఽ స్మీతి మత్వా సేవేత పండితః**
**అప్రమత్తశ్చ సతతం హితం కుర్యాత్ ప్రియంచయత్ – 26**

బుద్ధిమంతుడు 'నేను రాజుకు ఇష్టుడనుకాను' అని భావించి సేవ చేయాలి. ఎల్లప్పుడు పరాకు లేక రాజుకు ప్రియమైన, హితమైన పనినే చేయాలి.

**నాస్యా నిష్టాని సేవేత నాహితైః సహాసంవదేత్**
**స్వస్థానాన్నవి కంపేత సరాజ వసతిం వసేత్ – 27**

రాజుకు ఇష్టుడు కాని వానిని సేవించకూడదు. రాజు శత్రువులతో సంభాషించరాదు. తన కొసగిన స్థానం నుండి కదలరాదు. అటువంటివాడే రాజవసతిలో ఉండగలడు.

**'దక్షిణంవా థవావుం వా పార్శ్వ వూ సీత పండితః**

**రక్షిణాం హ్యేత్త శస్త్రాణాం స్థానం పశ్చాద్విధీయతే' – 28**

పండితులు రాజుకు కుడివైపున గాని ఎడమవైపున గాని కూర్చోవాలి. శస్త్రధారులైన రక్షకులు వెనుక వైపున ఉండాలి.

**'అసూయాన్తిహి రాజానో జనా నన్రుత వాదినః**

**తథైవ చావ మన్యన్తే నరాన్ పండిత మానినః' – 31**

అసూయాపరులై మెరమెచ్చుపు మాటలాడే అసత్యవాదుల్ని ప్రభువులు సహించరు. తమని తాము పండితులమని అహంకరించే వారిని రాజులు అవమానం పాలు చేస్తారు.

**'శూరో ౨_ స్మీతి నదృప్త స్స్యాద్ బుద్ధి మానితివా పునః**

**ప్రియమే వాచరన్ రాజ్ఞః ప్రియోభవతి భోగవాన్' – 32**

నేను గొప్ప శూరుణ్ణని, వివేకశీలినని గర్వించరాదు. రాజుకు ప్రియాన్ని కూర్చేవాడే, ఇష్టుడు, భోగవంతుడు కాగలడు.

**'యస్యకోపోమహాబాధః ప్రసాదశ్చ మహాఫలః**

**కస్తస్య మనసా పీచ్ఛే దనర్థం ప్రాజ్ఞసమ్మతః' – 34**

ఎవడి కోపం మహాబాధను కలిగిస్తుందో, ఎవడి అనుగ్రహం గొప్ప ఫలాలనిస్తుందో, అటువంటి ప్రభువుకు బుద్ధిమంతుడెవడూ మనసులోనైనా హానికలిగించేందుకు తలచడు.

**'న చోష్ఠౌ నభుజౌ జానూ నచవాక్యం సమాక్షిపేత్**

**సదావాతంచ వాచంచ ష్ఠీననంచా చరేచ్ఛనైః' – 35**

పెదవులు, చేతులు, మోకాళ్ళు, మాటలు, ప్రకటితం చేయరాదు. గాలివదలడం, పలకడ
ఉమ్మివేయడం ఇత్యాదిపనులు తెలియరాకుండా మెల్లిగా ఆచరించాలి.

**'హాస్య వస్తుషు చాన్యస్త వర్తమానేషు కేషుచిత్**
**నాతి గాఢం ప్రహృష్యేత నచాప్యున్మత్త వర్ధసేత్' - 36**

అన్యులకు సంబంధించిన నవ్వు కలిగించే సందర్భాలేవైనా ఏర్పడినపుడు అతిగా సంతోషించరాద
ఉన్మాది వలె పగలబడి నవ్వరాదు.

కొందరు వ్యక్తులకొక చిత్రమైన మనస్తత్వముంటుంది. ఒక వ్యక్తిపై, పైవాడు కించి
బాధ కలిగేలా చతురోక్తి పలికినా, ఎగతాళిగా వ్యంగ్యంగా మందలించినా, పక్కనున్నవా
సదరువ్యక్తి అవమానంతో కుంగిపోయేలా కసికొద్దీ పగలబడి నవ్వుతాడు. అదొక నీచమై
ఆనందం. అయితే మంచి వాడయిన ప్రభువు అలా నవ్వేవాణ్ణి క్షమించడు.

**'లాభేన హర్షయేద్ యస్తు నవ్యథేద్యయో ఽ వమానితః**
**అసం మూఢశ్చయోనిత్యం సరాజ వసతిం వసేత్' - 38**

లాభం కలిగినపుడు పొంగిపోక, అవమానం కలిగినపుడు వ్యథతో క్రుంగిపోక, ఎల్లపుడూ ఎవ
ఏమరుపాటు లేక రాజసేవలో ప్రవర్తిస్తాడో , అతడే రాజగృహంలో వసించగల్గుతాడు.

**'రాజానం రాజపుత్రంవా సంవర్ణయతి యస్సదా**
**అమాత్యః పండితో భూత్వా సచిరంతిష్ఠతే ప్రియః' - 39**

సదా రాజునో, అతని పుత్రుణ్ణో శ్లాఘిస్తుండేవాడు మంత్రిగానో, పండితుడో అయి చిరకాల
రాజుకు ఇష్టుడై విరాజిల్లుతాడు. ఆశ్రయించి బ్రతికేవారు, ప్రభువును స్తుతిస్తుండాల
చాణక్యుడు కూడా చెప్పాడు. 'స్వామీ స్తోతవ్యో ఽ ను జీవిభిః' అని చాణక్యుని రాజనీ
సూత్రం.

'ప్రగృహీతశ్చయో ఒ వమాత్యో నిగృహీతస్త్వ కారణైః
నవిందతి రాజానం లభతీ సంపదం పునః - 40

రాజానుగ్రహానికి పాత్రుడైనా, ఒకప్పుడు అకారణంగా రాజాగ్రహానికి పాత్రుడైతే, రాజు
నిందింపక సంయమనం పాటిస్తే, తిరిగి సంపదలు పొందగలుగుతాడు.

''స్వామిని కుపితే స్వామినమే వాను వర్తేత'' అంటాడు చాణక్యుడు. అంటే ప్రభువ
కోపించినా అతణ్ణే అనుసరించి ఉండాలి.

'అవమాత్యోహి బలాద్భోక్తుం రాజానం ప్రార్థయే తయః
నసతిష్ఠేత్ చిరం స్థానం గచ్ఛేచ్చ ప్రాణ సంకటం' - 42

ఇతరుల గురించి మూర్ఖంగా చాడీలు చెప్పేవాడు చిరకాలం తన స్థానాన్ని నిలుపుకోజాలడు
అటువంటి వాడికి ప్రాణ సంకటం కూడా ఏర్పడుతుంది.

చాడీలు చెప్పే నేతను భార్యా పుత్రాదులు కూడా విడిచి పెడతారంటూ చాణక్య
''పిశునో నేతా పుత్రదారైరపి త్యజ్యతే'' అనే రాజనీతి సూత్రం చెబుతోంది. ఇక సేవకు
సంగతి చెప్పేదేముంది.

'అవమ్లానో బలవాన్ శూరశ్చాయే వానుగతస్సదా
సత్యవాదీ మృదుర్దాంతః సరాజ వసతిం వసేత్' - 44

బడలిక నొందనివాడు (అవిశ్రాంతుడు), బలవంతుడు, శూరుడు, నిరంతరం నీడలా వెన్నం
ఉండేవాడు, సత్యవాది, మృదుస్వభావుడు రాజు గృహంలో ఉండగలడు.

'అస్యస్మిన్ ప్రేష్యమాణేతు పురస్తాద్య స్సముత్సవేత్
అహం కింకర వాణీతి సరాజ వసతింవసేత్' - 45

ప్రభువు ఒకడికి పని పురమాయిస్తుంటే, నన్నేమి చేయమంటారని కోరవగా ముందుకు వచ్చేవా
రాజు వసతిలో ఉండదగినవాడు.

**'ఆంతరే చైవ బాహ్యేచ రాజ్ఞాయశ్చాథ సర్వదా**

**ఆదిష్టోనైవ కంపేత సరాజవసతిం వసేత్' - 46**

బాహ్యాంతరాల్లో నిరంతరం జంకులేక రాజాజ్ఞను నిర్వర్తించే సేవకుడు రాజగృహంలో ఉండేందుకు యోగ్యుడు.

**'యోవైగృహేభ్యః ప్రవసన్ ప్రియాణాం నాను సంస్మరేత్**

**దుఃఖేన సుఖ మన్విచ్ఛేత్ సరాజ వసతిం వసేత్' - 47**

తన యింటికి దూరమైనానని దురపిల్లక, ఎప్పుడూ తనవారినే తలచుకొనకుండా, దుఃఖం నుండే సుఖాన్ని పొందగోరేవాడు రాజ గృహంలో వసించేందుకు సమర్థుడు.

**'సమవేషం నకుర్వీతనోచ్చైః సన్నిహితోవసేత్**

**నమంత్రం బహుధాకుర్యాదేవం రాజ్ఞః ప్రియోభవేత్' - 48**

రాజుతో సమానమైన వేషం ధరించక, హద్దుమీరి రాజుకడ అతి సన్నిహితంగా ఉండక, మిక్కిలిగా గూఢాలోచనం చేయక మెలిగేవాడు రాజుకు ఇష్టుడౌతాడు.

చాణక్యుడు రాజనీతి సూత్రాల్లో ''ఉద్ధత వేషధరో నభవేత్'' అని చెప్పాడు. రాజు ఎదుట ఆడంబరమైన వేషం ధరించకూడదు.

**'న కర్మణి నియుక్తస్సన్ ధనం కించిదపి స్పృశేత్**

**ప్రాప్నోతి హి హరన్ ద్రవ్యం బంధనం యదివా వధమ్' - 49**

రాజు ఒకపనిలో నియమించినపుడు కొంచమైనా ధనాన్ని స్పృశింపరాదు. అలా చేస్తే బంధింపబడటమో, లేక వధింపబడటమో సంప్రాప్తిస్తాయి. ఇప్పటి భాషలో చెప్పాలంటే - పనుల్లో కమీషన్లు కొట్టగూడదు.

**'యానం వస్త్రమలంకారం యచ్చాన్యతే సంప్రయచ్ఛతి**

**తదేవ ధారయా న్నిత్యమేవం ప్రియతరో భవేత్' - 50**

వాహనం, వస్త్రం, అలంకారం - ఆభరణం, ఏదైనా సరే రాజొసగిన దాన్ని నిత్యం ఉపయోగిస్తుంటే, అట్టి సేవకుడు రాజుకు ప్రీతి పాత్రుడవుతాడు.

ఈవిధంగా ధౌమ్యుడు రాజులకడ ఎలా మెలగాలో విపులంగా వివరించాడు. రాజులు, రాజాస్థానాల స్థానంలో ప్రస్తుత కాలపు అధికార్లు, మంత్రులు వారి కార్యాలయాలను ప్రతిక్షేపించుకొంటే, ధౌమ్యుడు చెప్పినవన్నీ ఇప్పటికీ అనుసరణీయాలే.

## ఏడవ అధ్యాయం

ధర్మజుడు కంకుభట్టను పేరుతో విరటుని వద్దకు వస్తాడు. ధర్మరాజును చూచి విరాటరాజు, ఎవరో మహానుభావుడై ఉంటాడని భావించి, సాదరంగా ఆహ్వానించి గోత్రనామాలు తెలియజేయవలసిందిగా కోరుతాడు. అపుడు ధర్మజుడు ''నేను ఇంతకు మునుపు యుధిష్ఠిరుడి స్నేహితుణ్ణి, వ్యాఘ్రపాద గోత్రీకుణ్ణి, బ్రాహ్మణుణ్ణి. అక్ష విద్యలో, అంటే పాచికలాటలో నిష్ణాతుణ్ణి, నన్ను 'కంకుడు' అంటారు'', అని విన్న వించుకొంటాడు. అప్పుడు విరటుడు '' ఓ మహాత్మా! నీవు కోరిన వరం ఇస్తాను. నేను నీ వాణ్ణి, ఈ రాజ్యం నీవే పాలించు. నాకు జూదమాడే వారంటే చాలా యిష్టం. దేవుడిలాగా ఉన్న నీవు నా రాజ్యానికి అర్హుడివి'', అంటాడు. అపుడు ధర్మరాజిలా చెబుతాడు :

**ప్రాప్తో వివాదః ప్రథమం విశాంపతే**
**నవిద్యతే కంచన మత్స్య హీనతః**
**నమేజితః కశ్చి ద్ధారయేద్ధనం**
**వరోమమైషోస్తు తవప్రసాదజః**

ఓ మత్స్యభూపాలా! జూదంలో, హీనుడైన వాని వల్ల కూడా గొప్పవాడికి వివాదం రాదు అని చెప్పలేము. తప్పకుండా వివాదం వచ్చే అవకాశముంది. అందువల్ల ఒక వేళ నేను గెలుపొందినా, నీవు నాకు ఋణగ్రస్తుడివి కాదు. నీ దయవల్ల ఇదే నాకు వరమగుగాక!''

జూదంలో తరతమ భేదాలు లేకుండా వివాదాలు వస్తూనే ఉంటాయి. అవి విపరీత పరిణామాలకు దారి తీస్తుండటం సహజం. అందుకే ''తమ్ముడు తమ్ముడే - పేకాట పేకాటే'' అంటుంటారు మనవాళ్ళు. ఓడిపోయినవాడు మనకేమీ బాకీలేడు, అప్పు పడినట్లు కాదు అనుకుంటే, ఇక గొడవలకి ఆస్కారం ఉండదు. లోకజ్ఞుడైన ధర్మరాజు అందుకే ముందుగా వైపరీత్యాలను పరిహరించేందుకు ఈ వరాన్ని కోరాడు. ఏడాదిపాటు 'నిగూఢవృత్తిమై' మెలగాలంటే మెలకువ అవసరం.

# తొమ్మిదవ అధ్యాయం

ద్రౌపది సైరంధ్రిగా విరటుని రాజ్యానికి చేరింది. ద్రౌపది అపురూప సౌందర్యాన్ని చూసి సుదేష్ణ '' ఓ సుందరీ! మా విరాట మహారాజు అసామాన్యమైన నీ సౌందర్యాన్ని చూస్తే, నన్ను వదిలి పెట్టి నీ మీదే మనసు నిలుపుకొంటాడు. నువ్వెవరినైనా చూశావంటే, వాడు కామవశుడవటం తథ్యం;'' అని సంశయిస్తుంది. ఆ సందర్భంగా సుదేష్ణ ఇలా అంటుంది.

**అధ్యారోహేద్యథా వృక్షాన్ వధాయై వాత్మనో నరః**

**రాజవేశ్మనితే సుభ్రు గృహేతు స్యాత్ తథావమమ - 28**

చక్కని కనుబొమలుగల ఓ తన్వీ! నిన్ను నాయింట నుంచుకోవడం చాలా ప్రమాదం సుమా! నరుడెవడైనా రాజగృహంలోని చెట్లనెక్కడమంటే, అది చావు కోరడమే! నిన్ను నాయింట్లో పెట్టుకోవడం రాజభవనంలోని చెట్టెక్కడం వంటిదే సుమా! రాజుగారి పెరట్లో చెట్లెక్కడమంటే - ఎక్కినవాడు ఫలాల కోసం ఎక్కాడంటే ఎవరు నమ్ముతారు? రాజ భవనంలో దొంగతనం కోసం కావచ్చు, రాజకాంతలపై అత్యాచారం చేసేందుకైనా కావచ్చు; గూఢచర్యం కోసం కావచ్చు. కాబట్టి అది రాజుల దృష్టిలో పెద్ద అపరాధమే. అటువంటివాడు తప్పక వధ్యుడే.

# కీచకవధపర్వం - పధ్నాలుగవ అధ్యాయం

ద్రౌపదినిగాంచి మరులుగొని పరిపరి విధాల కామ ప్రలాపాలతో ప్రగల్భించిన కీచకుడికి ద్రౌపది ధర్మబోధ చేసింది. కానీ అభవ్యుడైన వాడికి నీతిబోధ కర్ణశూల వంటిదే కదా!

''ఓ సూతపుత్రా! కోరదగని దానిని నేను. అటువంటి నన్ను కోరుతున్నావు. నేను హీనకుల సంజాతను, రోత గొలిపేదాన్ని, కేశ సంరక్షణ చేస్తూ, జడలల్లుతూ బ్రతికే దాసిని, సైరంధ్రిని. నన్ను ఆశించవద్దు'' అని ప్రార్థిస్తూ ద్రౌపది కీచకుడికిలా హితబోధ చేసింది.

**'స్వేషు దారేషు మేధావీ కురుతే యత్నముత్తమమ్**

**స్వదార నిరతో హ్యాశు నరో భద్రాణి పశ్యతి.' - 35**

మేధావియైనవాడు, జ్ఞానం కలవాడు తన భార్యయందే ఉత్తమమైన రీతిగా ప్రయత్న మొనరిస్తాడు. భార్యా నిరతుడైన నరుడు శీఘ్రమే శుభాలు బడయగలడు.

ధర్మజుడు భార్య ఔన్నత్యం గురించి మునుపు వక్కాణించాడు. ఈ సందర్భంలో ద్రౌపది కీచకునితో భర్తకు భార్యానిష్టమైన వలపు మాత్రమే ఉండాలని ఉపన్యసించింది.

**'నచాధర్మేణ లిప్యేత నాపకీర్తి మవాప్నుయాత్**

**స్వదారేషు రతిర్ధర్మో మృతస్యాపి నసంశయః' - 36**

అధర్మం అంటకుండు గాక! అపకీర్తి ప్రాప్తించకుండుగాక! మృతిచెందినా తన భార్య యందే కోరిక యుండుట ధర్మం. ఈ విషయంలో ఎట్టి సంశయం లేదు.

**'స్వజాతి దారా మర్త్యస్య ఇహలోకే పరత్రచ**

**ప్రేత కార్యాణి కుర్వన్తి నివాపై స్తర్పయంతిచ**

**తరక్షయ్యంచ ధర్మ్యంచ స్వర్గ మాహుర్మనీషిణః' - 37**

ఇహ లోకంలో భార్య, పరలోకంలోని మర్త్యుడికి ప్రేతకార్యాలొనరుస్తుంది. నివాపజలంతో

తర్పణాలిస్తుంది. ఈ ధర్మం అక్షయమైనది, స్వర్గ ప్రాప్తి కలిగించేది అని జ్ఞానవంతులు చెబుతారు.

'ప్రియాహి ప్రాణినాం దారా స్తస్మాత్త్వం ధర్మ భాగ్భవ
పరదార రతో మర్త్యో నచ భద్రాణి పశ్యతి' - 38

మానవులకు భార్య మిక్కిలి ప్రియమైనది. అందుచేత ధర్మ భాగుడవై ఉండు. పరస్త్రీల పట్ల ఆసక్తుడైన నరుడు శుభములు పొందజాలడు.

'పరదారాస్మి భద్రంతే నయుక్తం తవ సాంప్రతమ్
దయితాః ప్రాణినాం దారా ధర్మం సమను చింతయ' - 39

ఓ కీచకా! నేను పరుల భార్యను, కాబట్టి నన్ను వాంఛించడం నీకు తగదు. ప్రాణులకు భార్యయే మిక్కిలి ప్రీతి పాత్రమైనది. ధర్మాన్ని ఆలోచించు. నీకు శుభం కలుగుతుంది.

'పరదార నతే బుద్ధిర్జాతు కార్యా కథంచన
వివర్జనం హ్యా కార్యాణామేతత్ సుపురుషవ్రతమ్' - 40

ఉత్తములైనవారి లక్షణములేమిటంటే, తగని పనులు చేయకుండుటయే. అందుచే, పరస్త్రీలపై ఎప్పటికీ బుద్ధి నిలుపవద్దు.

'మిథ్యాభి గృధ్నోహినరః పాపాత్మా మోహమాస్థితః
అయశః ప్రాప్నుయాద్ఘోరం మహద్వాప్రాప్నుయాద్భయమ్' - 41

మిథ్యయైన విషయాలను వాంఛించే నరుడు పాపాత్ముడు. మోహం చేత బంధితుడు. అటువంటి వాడికి అపకీర్తిగాని, గొప్ప ఆపదకాని సంభవిస్తుంది.

''అయశస్య మనాయుష్యం పరదారాభిమర్శనమ్
అర్థక్షయకరం ఘోరం పాపస్యచ పునర్భవమ్'' అని

రామాయణం కూడా ఈ విషయాన్ని నొక్కి వక్కాణించింది. ఈ ప్రకారంగా ద్రౌపది నయానా,

భయానా చెప్పింది. కానీ ఆ కామాంధుడు దుర్విదగ్ధుడు చెవినబెట్టలేదు. ఆనాటి నుండీ ఈనాటి దాకా చెప్పేవారు ప్రతికాలంలోనూ ఉన్నారు. వినేవాళ్ళే లేరు. ఆచరించే వాళ్ళు అసలే లేరు. 'వినాశకాలే విపరీతబుద్ధిః' అన్నారు పెద్దలు. 'ఉపస్థిత వినాశానాం ప్రకృతిః ఆకారేణ కార్యేణచ లక్ష్యతే' అన్నాడు – చాణక్యుడు రాజనీతి సూత్రాల్లో. వినాశనం చేరువయిన వాళ్ళ స్వభావం, వాళ్ళ ఆకారం, చేతల వల్లనే తెలుస్తుంది.

కీచకుడు ద్రౌపదిపై తన మోహాన్ని నిర్భీతిగా వెల్లడించసాగాడు. అపుడు ద్రౌపది అతణ్ణి హెచ్చరించింది. ''నన్ను అవమానించిన నీవు చుట్టపక్కాలతో సహా, పిల్ల పాపలతో సహా నాశనమవుతావు. మహావీరుల రక్షణలో నున్న నన్ను కామిస్తే తొడిమనుండి రాలిపడే తాటిపండులా కూలిపోతావు'' అన్నది. నా గురించి తెలియక కామార్తుడివై చెడ్డ మాటలు వదరుతున్నావు. ఆశక్తుడు పర్వతాన్ని దాటలేడు సుమా'' అని బెదిరించింది.

**దిశం ప్రపన్నో గిరి గహ్వరాణివా**
**గుహాం ప్రవిష్టో ఽ ంతరితో ఽ పి వాక్షితేః**
**జుహ్వన్ జపన్వా ప్రపతన్గిరేస్తటాత్**
**హుతాశనాదిత్య గతిం గతో ఽ పివా**
**భార్యాభిమంతా పురుషోమహాత్మనాం**
**నజాతు ముచ్యేత్ కథంచ నాహతః – 58**

మహాత్ముల భార్యను అవమానించినవాడు – దిక్కుల్ని శరణువేడినా, గిరి కందరాలలో చొరబారినా, గుహల్లో దాగినా, క్షితి గర్భంలో నక్కినా, జప హోమాలు ఆచరిస్తున్నా, గిరిశిఖరాల నుండి దూకుతున్నా, అగ్నిలా సూర్యునిలా నిలువలేక పరుగెత్తుతున్నా, మృత్యువును తప్పించుకోజాలడు.

పాపాలన్నీ చేసి గుడికి వెళ్ళి కొబ్బరికాయ కొడితే అవి తొలగిపోవు. వెంటాడక మానవు. ''ఘన దుర్మదుడై తామునిగితే కావేరీ మందాకిని ఎటు బ్రోచును'' అన్నాడు త్యాగరాజస్వామి.

# పదిహేనవ అధ్యాయం

కీచకుడు అక్కగారైన సుదేష్ణ వద్దకు వెళ్ళి ఎలాగైనా సైరంధ్రిని తాను పొందే ఉపాయం ఆలోచించుమన్నాడు. లేకపోతే తన ప్రాణాలు నిలవడం కష్టమని విలపించాడు. నూరుగురు కాదు పదివేలమంది గంధర్వులు వచ్చినా ఒక్కడినే వారిని హతమారుస్తానన్నాడు. అపుడు సుదేష్ణ తామందరికీ కీచకునివల్ల కీడు మూడుతుందని దుఃఖించింది. అప్పుడు కోపంతో బాధతో ''నీ ఆయువు మూడింది. అందుకే ఇలా దుష్కామ విమోహితుడివయ్యావు. పైగా చేయకూడని పనికి నన్ను నియక్తురాలిని చేస్తున్నావు అన్నది. ఆ సందర్భంగా ....

**అపి చైతత్ పురాప్రోక్తం నిపుణైః మనుజోత్తమైః**

**ఏకస్తు కురుతే పాపం స్వజాతిస్తే నహన్యతే - 18**

లోకజ్ఞులైన మహానుభావులు ఎపుడో చెప్పారు, ఏమని? ఒకడు పాపం చేస్తాడు, అంతటితో వాడి కులమంతా నాశనం చెందుతుంది అని. ఒక నీచుడు, దుష్టుడు, పాపాత్ముడు ఉంటే చాలు – వంశమంతా నాశనమవడానికి.

ఆదిపర్వంలో ఉదంకోపాఖ్యాన ఘట్టంలో ఉదంకుడు జనమేజయుణ్ణి సర్పయాగానికి ప్రోత్సహించాడు. ''తక్షకుడు నీ తండ్రిని కాటువేసి నీకూ అపకారం చేశాడు. గురుపత్ని నిమిత్తం నేను పౌష్యమహారాజు దేవేరి పవిత్ర కుండలాలను కొని వెళ్తుంటే వాటినపహరించి నాకూ అపకారం చేశాడు. కాబట్టి తక్షకుడి నెపంతో సర్పజాతినంతా సర్పయాగంలో ఆహుతి చేయవలసింది'' అని పురెక్కించాడు. ఆ సందర్భంగా ....

**''ప్రల్లదుడైన నొక్క కులపాంసను చేసిన దాన తత్కులం**

**బెల్లను దూషితంబగుట యేమి యపూర్వము?''** అన్నాడు నన్నయ.

దుర్యోధనుని వల్ల ధార్తరాష్ట్రులంతా నశిస్తారనే భవిష్యసూచకమైన మాటయిది.

''వేరుపురుగు చేరి వృక్షంబు చెఱచును – చీడపురుగు చేరి చెట్టు చెఱచు, కుత్సితుండు చేరి గుణవంతు చెఱచురా'' అని వేమన చెప్పినా – కొఱగాని కొడుకు పుట్టిన – కొఱగామియె గాదు తండ్రి గుణములు చెఱచున్–చెఱకు తుద వెన్ను పుట్టిన – చెఱకున తీపెల్ల చెఱచు సిద్ధము సుమతీ'' అని బద్దె భూపాలుడు ప్రవచించినా, ఒక్క పాపాత్ముని వల్ల దుష్ఫలితం వంశానికి కూడా సోకుతుందని చెప్పడమే.

రామాయణం కూడా యిదే మాట చెప్పింది –

**''ఏకోహి కురుతే పాపం కాలపాశవశంగత:**

**నీచేనాత్మా పచారేణ కులంతే నవినశ్యతి''**

విధివశుడైన నీచుడు చేసిన పాపం వల్ల కులక్షయమవుతుంది.

గత్యంతరం లేక సుదేష్ణ సైరంధ్రిని మదిర గొని తెమ్మని కీచకుని మందిరానికి పంపవలసి వచ్చింది. అక్కడ కీచకుడు సైరంధ్రితో మోహాంధుడై ప్రలాపించాడు. తన వద్దగల దివ్యమైన శయ్యపై మధువు సేవిస్తూ తనతో రమించమని వదరిన కీచకుణ్ణి అసహ్యించుకొంటూ ద్రౌపది ''ఓరి దుర్బుద్ధీ! బ్రాహ్మణ స్త్రీని నిషాదుడు స్పృశింపజాలని విధంగా నన్ను నీవు తాకజాలవు. నీ దుష్కామంతో ఘోరమైన గతిని పొందవద్దు అని హెచ్చరిస్తూ --

**యత్రగచ్ఛతి బహవ: పరదారాభి మర్శకా:**

**నరా: సంభాన్న మర్యాదా: కీటవచ్ఛ గుహాశయా: – 5**

పర భార్యలను ఆశించు మర్యాదలేని దుష్టులెందరో గుహలలో నుండే కీటకాలను చేరుకుంటారు; అని మందలించింది.

తనను తూలనాడుతున్న ద్రౌపదిని కీచకుడు పట్టుకోనుంకించాడు. ఆమె అదృశ్య రాక్షస బల సహాయంతో నెట్టివేసే సరికి మొదలు నరికిన చెట్టులా కూలిపోయాడు. అప్పుడు ద్రౌపది యుధిష్ఠిరుడున్న నిండు సభలోకి వచ్చి శరణుకోరింది. కీచకుడామె వెంటనంటివచ్చి

జుట్టుపట్టి లాగి కాలితో తన్నాడు. ద్రౌపది ముఖం నుండి రక్తం కారింది. సభలోని వారంతా విస్తుపోయారు. అక్కడే ఉన్న భీమసేనుడు; మదమాతంగంలాగా సమీపంలోని మహావృక్షాన్ని వీక్షించాడు. సమయభంగమవుతుందని ధర్మరాజు భీముణ్ణి –

**''ఆలోకయసి కిం వృక్షం సూద దారుకృతేనవై**

**యదితే దారుభిః కృత్యం బహిర్వృక్షాన్ని గృహ్యాతామ్''**

''వలలుండెక్కడ జూచె నొండెడ నసేవ్యక్ష్మాజముల్ పుట్టవే''

కట్టెలతోపని ఉంటే బయటనెక్కడనో ఉన్న చెట్లు కొట్టవచ్చు గదా!

**'యస్య చార్ద్రస్య వృక్షస్య తచ్ఛాయా సమాశ్రయేత్**

**నతస్య పర్ణం ద్రుహ్యేత పూర్వ వృత్త మను స్మరన్'**

ఇది పచ్చి చెట్టు. దీని శీతలచ్ఛాయను మనం సమాశ్రయించాము. పూర్వ వృత్తాంతాన్ని స్మరించి, దీని ఆకు కూడా త్రుంచివేయరాదు'', అంటూ అన్యాపదేశంగా వారించాడు.

ద్రౌపది సభాద్వారం చేరి దీనంగా మిగిలిన భర్తల్ని చూస్తూ విరాటరాజుతో యిలా అన్నది.

**ప్రజారక్షణ శీలానాం రాజ్ఞాం హ్యమిత తేజసామ్**

**కార్యంహి పాలనం నిత్యం ధర్మే సత్యేచ తిష్ఠతామ్ – 28**

అమిత తేజస్కులై ప్రజారక్షణ శీలురైన ప్రభువులకు ధర్మం సత్యం పట్ల నిష్ఠ గలవారిని పాలించడం నిత్యవిధి.

**స్వ ప్రజాయాం ప్రజాయాంచ విశేషం నాధి గచ్ఛతామ్**

**ప్రియేష్వపి చద్వేషేషు సమత్వం యే సమాశ్రితాః – 29**

అటువంటి రాజులు కన్న బిడ్డల యందు, ప్రజలయందు తేడాను పాటించరు. వారు యిష్టుల విషయంలోను, ద్వేషింప దగిన వారి విషయంలోనూ సమత్వాన్నే ప్రదర్శిస్తారు.

**వివాదేషు ప్రవృత్తేషు సమం కార్యానుదర్శినా**

**రాజ్ఞా ధర్మాసనస్థేన జితౌ లోకావుభావపి – 30**

ధర్మపీఠాన్ని అధిరోహించిన ప్రభువు వివాదాలు సంభవించినపుడు కర్తవ్యాన్ని సమదృష్టితో నిర్వహిస్తే ఇహలోక పరలోకాలను కూడా జయించగల్గుతాడు.

**అస్త్వధర్మేణ కార్యాణి మోహాత్మా కురుతేనృపః**

**అచిరాత్ తం దురాత్మానం వశే కుర్వన్తి శత్రవః – 34**

మోహాత్ముడై అధర్మ కార్యాలొనరించే దురాత్ముడైన రాజును అంతలోనే శత్రువులు వశపరచుకొంటారు.

**'అకార్యాణా మనారంభాత్ కార్యాణా మనుపాలనాత్**

**ప్రజాసు యే సువృత్తాస్తే స్వర్గ మాయాంతి భూమిపాః' – 38**

అకార్యాలజోలికి పోకుండటం, చేయదగిన కార్యాలను సంరక్షణ చేయడం వల్ల ప్రజల మంచిని సంపాదించిన భూమిపాలుడు స్వర్గాన్ని పొందుతాడు.

**కార్యాకార్యా విశేషజ్ఞాః కామకారేణ పార్థివ**

**ప్రజాసు కిల్బిషం కృత్వా నరకం యాంతి అధోముఖాః' – 39**

ఓ రాజా! చేయదగినదేదో, చేయదగనిదేదో తెలిసి కూడా, యథేచ్ఛగా ప్రజల విషయంలో పాపాలొనరించేవాడు అధోముఖుడై – లజ్జతో తలవంచుకొని – తలక్రిందులుగా నరకానికి వెళ్తాడు.

**'నైవ ధర్మైర్నవాదానైర్నగురోరుప సేవయా**

**ప్రాప్నువంతి తదాధర్మం యథా కార్యాను పాలనాత్' – 40**

ఎన్నో ధర్మాలాచరించ వచ్చు, దానాలు చేయవచ్చు, గురుసేవ చేయవచ్చు. కానీ ఈ ధర్మాలేవీ తన కర్తవ్యాన్ని చక్కగా నిర్వర్తించడంతో సమమైనవికాదు. కర్తవ్యపాలన, – స్వధర్మాచరణం

ఎంతో ముఖ్యమైనది. భగవద్గీత బోధించిన ధర్మాలలో కర్తవ్యాచరణం ప్రధానమైనది.

''కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన,''

''శ్రేయాన్ స్వధర్మో విగుణః,'' అనే గీతా సూక్తులు ఈ ధర్మానికి సన్నిహితమైనవే.

క్రియాయా మక్రియాయాంచ ప్రాపణే పుణ్యపాపయోః

ప్రజాయాం సృజ్యమానాయాం పురాహ్యేత దుదాహృతమ్ - 41

చేయదగిన కార్యమేది, చేయదగని అకార్యమేది, పాపపుణ్యాలను ప్రాపింపచేసేదేది అనే విషయం ప్రజల్ని సృజించటానికి ముందే పేర్కొనబడింది.

'ఏతద్ద్వేమానుషాః సమ్యక్ కార్యం ద్వంద్వతయాభువి

అస్మిన్ సునీతే దుర్నీతే లభతే కర్మజం ఫలమ్!' - 42

ఓ మనుష్యులారా! ఈ భువిపై మీరు ఆచరించవలసిన కార్యం ద్వివిధమై ఉంది. నీతి బద్ధంగా చక్కగా చేయడం, దుర్నీతితో చెడగొట్టడం. దీనికి అనుగుణంగానే మానవుడు కర్మఫలాన్ని పొందుతాడు.

'కల్యాణకారీ కల్యాణం పాపకారీ చ పాపకమ్

తేన గచ్ఛతి సంసర్గం స్వర్గాయ నరకాయవా' - 43

స్వర్గం, నరకం అనేవి పుణ్యకార్యాలు చేయడం, లేక పాప కార్యాలు చేయడాన్ని బట్టి సంప్రాప్తిస్తాయి.

చాణక్యుడు రాజనీతి సూత్రాల్లో చెప్పిన ఈ క్రింది సూక్తి ఈ సందర్భంగా ప్రస్తావించడం సముచితం – ''మాతరమివ వత్సాః'' – 'సుఖదుఃఖాని కర్తారమేవాను గచ్ఛంతి'

లేగ దూడలు తల్లి వెంట వెళ్లినట్లు, సుఖదుఃఖాలు, పుణ్యపాపకర్మలు చేసిన వాళ్ళ దగ్గరకే వెళతాయి. రామాయణం కూడా ఇదే విషయాన్ని ప్రబోధించిందిలా –

'యథాచరతి కర్మాణి శుభం వాయది వా ఉ_ శుభమ్
తదేవలభతే భద్రం కర్తా కర్మజ మాత్మనః'

మంచిగా గానీ చెడుగా గానీ – ఎలా ప్రవర్తిస్తాడో, అందువల్ల కలిగే సుఖదుఃఖాలనే మానవుడు అనుభవిస్తున్నాడు.

'సుకృతం దుష్కృతం వాపి కృత్వా మోహేన మానవః
పశ్చాత్తాపేన తప్యేత స్వబుద్ధ్యా మరణం గతః' – 44

మానవుడు మోహ విభ్రాంతుడై సత్కార్యమో దుష్కార్యమో చేసిన తర్వాత పశ్చాత్తాపం చెందినా, స్వబుద్ధితో తాను మరణం పొందినట్లే.

ఈ ధర్మాలన్నీ బ్రహ్మదేవుని వద్ద దేవేంద్రుడు విని దేవ రాజ్యాన్ని పరిపాలించాడు. కాబట్టి బ్రహ్మ చెప్పిన రీతిగా కార్యాకార్యాలలో స్థిరుడవు కావలసిందని ద్రౌపది ఉపన్యసించింది. అధికారంలో నున్నవాడు స్వపర భేదం లేకుండా నిర్ణయం గైకొనాలని, తన కర్తవ్యాన్ని విస్మరించరాదనీ సారాంశం. కీచకుని విషయంలో బంధుప్రీతినీ, భీతినీ వదలి తనకు న్యాయం చేయవలసిందిగా అభ్యర్థించింది. తరువాత విరటుని ధోరణికి, భర్తల వైఖరికి కించిత్ కోపం కూడా వ్యక్తం చేసింది. అపుడు ధర్మజుడు, ద్రౌపదిని సుదేష్ణ మందిరానికి పొమ్మని మందలించాడు. ''సూర్యతేజస్కులైన నీ భర్తలు ఇది అనువైన సమయం కాదని నిన్నాదుకొనేందుకు పరుగు పరుగున వచ్చి ఉండకపోవచ్చు'' అంటూ వనితా ధర్మాలను వక్కాణించాడు.

'నాస్తి కశ్చిత్ స్త్రియా యజ్ఞో వశ్రాద్ధం నాప్యుపోషణమ్
యాచ భర్తరి శుశ్రూషా సాస్వర్గాయాభిజాయతే' – 81

యజ్ఞం, శ్రాద్ధ కర్మ, ఉపవాసం, మొదలైనవేవీ చేయనవసరంలేదు, భర్తకు శుశ్రూష చేయడమే స్త్రీకి స్వర్గ ప్రాప్తి నిస్తుంది.

**'పితారక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే**

**పుత్రస్తు స్థా విరే భావే న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి.' - 82**

బాల్యంలో తండ్రి, యవ్వనంలో భర్త, వృద్ధాప్యంలో పుత్రుడు స్త్రీని రక్షిస్తారు. కాబట్టి స్త్రీకి ఏదశలోనూ స్వాతంత్ర్యం లేదు.

ఇది ఎప్పుడో వ్యాసుని కాలంనాటి మాట. స్త్రీలు అన్ని రంగాల్లోనూ ముందుకు దూసుకుపోతున్న కాలమిది. రమణులు రాజ్యాలేలుతున్నారు. నిజమే. ఇన్ని శతాబ్దాలు గడచినా పురుషుడి రక్షణ ఈనాటికీ స్త్రీకి ఆవశ్యకంగానే ఉన్నది. రాయితీలు, ప్రోత్సాహకాలు, అనుదినం జరిగే అత్యాచారాలు - ఇవన్నీ స్త్రీ ఇంకా పూర్తిగా సబల కాలేదనడానికి నిదర్శనం కాదా?

కడుపులో పెరిగేది ఆడపిల్ల అని తెలిసి గర్భస్రావానికి పాల్పడుతున్న సంఘటనలు అను నిత్యం అనేకం. ఎందువల్ల? అని ఆలోచించాలి. ఈనాటికీ ఆడపిల్ల పెళ్ళి ఒక సమస్యగా ఎందుకున్నది? ఆ రోజుల్లో వలె అసూర్యంపశ్యత్వం ఈనాడు దాదాపు తొలగి పోయిందనవచ్చు. కట్టుబాట్లు చాలావరకు సడలిపోయాయనవచ్చు. అంతమాత్రాన స్త్రీ పురుష రక్షణ అవసరంలేని సంపూర్ణ సబలగా ఎదిగిందని నిబ్బరంగా ఎవరు చెప్పగలరు?.

**పడిన యామిషంబు పక్షులపేక్షించు**

**నట్లు పురుషహీన యయిన యువతి**

**జూచి యెల్లవారు జులుక నపేక్షింతు**

**రిదియు బాపమనక హీనమతులు** - అని భారతం చెబుతోంది.

**(ఆదిపర్వం-ఆరవ ఆశ్వాసం - 257వ పద్యం)**

పై నుండి జారిపడిన మాంసాన్ని పక్షులపేక్షించినట్లుగా, భర్తృహీన, రక్షణ లేని స్త్రీని చులకన భావంతో అపేక్షిస్తారు అందరూ. అందరూ అంటే సజ్జనులని కాదు, హీనులైన వారు అని. సమాజంలో అత్యధిక భాగం అటువంటి వారే కదా! అందువల్ల ఎవరో ఫెమినిస్టు దృక్పథంతో

ఉపన్యసించేవారిని తప్పిస్తే, ఈనాటికీ ఈ సూక్తికి పూర్తిగా కాలదోషం పట్టలేదనే చెప్పవచ్చు.

**'భర్తౄన్ ప్రతియథాపత్న్యో నక్రుధ్యన్తి కదాచన**

**బహు భిశ్చ పరిక్లేశై రవజ్ఞాతాశ్చ శత్రుభిః**

**అనన్య భావ శుశ్రూషాః పుణ్యలోకం వ్రజన్త్యుతే' - 83**

ఎన్నో కష్టాలపాలు జేసినా, శత్రువులు అవమానించినా, భార్యలు భర్తలపట్ల క్రుద్ధులు కారు. అనన్యభావంతో శుశ్రూష చేసి పుణ్యలోకం చేరుకుంటారు.

ఇంకా ధర్మజుడిలా అన్నాడు, "ఓ విశాలనయనా! నీ పతులు ఏదైనా నియమవ్రతులై ఉన్నారేమో! ఒకసారి స్మరణకు తెచ్చుకో. క్షమాశీలివైన ఓ సైరంధ్రీ :-

**'క్షమా సత్యం, క్షమాదానం, క్షమాధర్మః, క్షమాతపః**

**క్షమావతా మయంలోకః పరలోకః క్షమావతామ్' - 86**

ఓర్పే సత్యం, దానం, ధర్మం, తపస్సు కూడా, ఇహపరలోకాలు క్షమావంతులకే లభ్యమవుతాయి. క్షమించడమే యుక్తం, ఎవర్నీ బాధించకూడదని చాణక్యరాజనీతి సూత్రం.

'క్షంతవ్యమితి పురుషం నాబాధేత'.

రామాయణంలో కూడా ఈ సూక్తి దాదాపు ఇలానే కనిపిస్తుంది.

అలంకారోహి నారీణాం క్షమాతు పురుషస్యవా

క్షమా దానం క్షమాయజ్ఞం క్షమా సత్యం హి పుత్రికాః

క్షమా యశః క్షమాధర్మః క్షమయా నిష్ఠితం జగత్.

స్త్రీ పురుషులెవ్వరైనా క్షమా గుణమే ఆభరణం. ఓర్పే దానం, యజ్ఞం, సత్యం, యశస్సు, ధర్మం. క్షమలోనే జగత్తు నిలుస్తుంది.

వైశంపాయనుడు కథను కొనసాగిస్తూ " ఓ జనమేజయ మహారాజా! కీచకుడు తన పినతల్లి కూతురైన సుదేష్ణను ప్రేమగా సేవిస్తూ విరాట నగరంలో సుఖంగా ఉన్నాడు. అతడి

సోదరులు అనేకులు పరాక్రమవంతులు, అన్నగారి పట్ల భక్తి గలవారు, కాలేయులనే రాక్షసు
కీచకులుగా జన్మించారు. వారిలో పెద్దవాడైన బాణుడు కీచకులలో పెద్దవాడు. విరటుడి
పదిమంది తమ్ములున్నారు. వారంతా కూడా కీచకునికి లోబడి ఉన్నారు. ఈ సంగతిల
ఉంచితే, ద్రౌపది కీచకుణ్ణి ఎందుకు శపించలేదు అనే సందేహం కలుగుతుంది.''

**'క్షరతీతి తపః క్రోధాత్ ఋషయోన శపన్తిహి**

**జానన్తి తద్యథా తత్త్వం పాంచాలీ న శాపతామ్' - 135**

కోపం వలన తపస్సు క్షీణిస్తుందని ఋషులు శపించరు. ఆ విషయం బాగా తెలిసిన పాంచా
శపించలేదు.

ఈ సందర్భంలో వ్యాసుడు తిరిగి క్షమాగుణౌన్నత్యాన్ని గూర్చి వైశంపాయనుని చేత
మరోసారి వక్కాణింపజేశాడు.

కోపం అనర్థదాయకం గదా! 'కోపశ్చేదన లేనకిమ్' (కోపం ఉంటేవేరే అగ్ని ఎందుకు?)
అన్నారు పెద్దలు.

''క్షమా యుక్తస్య తపో వివర్ధతే'' ఓర్పు గల వాని తపస్సు పెరుగుతుంది అని చాణక్యుని
రాజనీతి సూత్రం.

**క్షమాధర్మః క్షమాదానం క్షమాయజ్ఞం క్షమాయశః**

**క్షమాసత్యం క్షమాశీలం క్షమాకీర్తిః క్షమాపరమ్**

**క్షమాపుణ్యం క్షమాతీర్థం క్షమాసర్వమితి శ్రుతిః**

**క్షమావతా మయంలోకః పరశ్చైవ క్షమావతామ్**

**ఏతత్సర్వం విజానన్తి సాక్ష మా మన్యపద్యతే - 136**

క్షమయే ధర్మం, దానం, యజ్ఞం, యశస్సు, సత్యం, శీలం, పుణ్యం, తీర్థం, అన్నీ క్షమక
మారు రూపాలేనని పెద్దల మాట.

ఓర్పు నిగ్రహం కలవారికే ఇహం పరం సిద్ధిస్తాయి. ఈ సంగతి తెలిసే ద్రౌపది ఓర్పు వహించింది.

'యస్త్వముత్పతితం క్రోధం క్షమయైవ నిరస్యతి
యథోరగస్త్వచం జీర్ణాం సవై పురుష ఉచ్యతే'

అంటోంది రామాయణం. విజృంభించే కోపాన్ని పాము కుబుసాన్ని విడిచినట్లు ఓర్పుతో విడనాడాలి. అటువంటివాడే అసలైన పురుషుడు.

సమస్తం క్షమాగుణమే, క్షమలోనే సమస్త సత్కార్యాలూ ప్రయోజనాలు కూడి ఉన్నాయని భారతం చెప్తున్నది. ఈ ధర్మాన్ని ఆచరిస్తే లోకంలో శాంతి రాజ్యమేలుతుంది.

## ఇరవయ్యవ అధ్యాయం

కీచకునిచే అవమానింపబడి, విరటుని సభలో చెప్పవలసిన మాటలు చెప్పి, వినవలసినవి విని తిరిగి వెళ్ళిన ద్రౌపది రహస్యంగా మహానస గృహానికి వెళ్ళి భీమసేనుణ్ణి మేల్కొలిపింది. వారిద్దరి సంభాషణ సందర్భంగా ద్రౌపది అదృష్ట దురదృష్టాలెలా వచ్చిపోతాయో వివరిస్తూ, విధి బలీయతను అంగీకరిస్తూ ఇలా అన్నది.

'అనిత్యాకిల మర్త్యానాం అర్థ సిద్ధిర్జయాజయౌ
ఇతికృత్వా ప్రతిక్షామి భర్తౄణాముదయంపునః' – 3

మానవులకు అర్థసిద్ధి, జయాపజయాలు అనిత్యమైనవి. అందుచే నా భర్తలు తిరిగి అభ్యుదయం పొందేందుకై నిరీక్షిస్తున్నాను.

'చక్రవత్పరివర్తన్తే హ్యర్థాశ్చవ్యసనానిచ
ఇతికృత్వా ప్రతీక్షామి భర్తౄణాముదయం పునః' – 4

సంపదలు, సిద్ధులు, దుఃఖాలు చక్రంలాగా క్రింద మీదవుతుంటాయి. ఈ ఉద్దేశ్యంతోనే నాభర్తలు

తిరిగి అభ్యుదయం పొందేందుకై నిరీక్షిస్తున్నాను.

**' యుఏవ హేతుర్భవతి పురుషస్య జయావహః**
**పరాజయేచ హేయశ్చ సఇతి ప్రతిపాలయే**
**కిం మాంన ప్రతిజానీషే భీమసేన మృతామివ' - 5**

పురుషుడికి విజయం చేకూర్చేందుకు ఏదిహేతువో, అదే ఒక్కొక్కపుడు పరాజయానికి కూడా హేతువవుతుంది. అందుకే తగిన సమయం కోసం ఎదురుచూస్తున్నాను; భీమసేనా! అటువంటి నన్ను నీవు మృతిచెందిన దానిని మాదిరిగా పట్టించుకోవడం లేదు.

ఇక్కడ ద్రౌపది దుర్యోధనుని నడమంత్రపు సిరిని దృష్టిలో నుంచుకొని ఈ మాటలన్నది. దుర్యోధనుని వంటి మానవుడికి ఏ కాలం కలిసి వచ్చి ఉన్నతిని, విజయాన్ని సమకూర్చిందో, అదే కాలం వాని పరాజయానికి కూడా కారణమవుతుంది, అని ఉద్దేశ్యం.

**'దత్వాయాచన్తి పురుషాహత్వా వధ్యన్తి చాపరే**
**పాతయిత్వాచ పాత్యన్తే పరైరితి చ మేశ్రుతమ్' - 6**

దానం చేసినవాడే యాచకుడైపోవచ్చు. దెబ్బ కొట్టినవాడే ఒకనాటికి దెబ్బతినవచ్చు. ఇతరుల్ని కూల్చివేసినవాడే ఇతరులచే కూలిపోవచ్చు. విధి ప్రభావ మిటువంటిదని నేను వినియున్నాను.

**'నదైవస్యాతి భారోఽపి నచైవా స్యాతివర్తనమ్**
**ఇతి చాప్యాగమం భూయో దైవస్య ప్రతిపాలయే' - 7**

దైవానికి భారమైనది - మోయలేనిది, అనగా సాధ్యం కానిదంటూ లేదు. దైవాన్ని అతిక్రమించడమూ సాధ్యం కాదు. అందుకే ఆ సద్విధి కోసం నిరీక్షిస్తున్నాను.

**'స్థితం పూర్వం జలం యత్ర పునస్త త్రైవగచ్ఛతి**
**ఇతి పర్యాయ మిచ్ఛన్తీ ప్రతీక్షే ఉదయం పునః - 8**

అంతకు ముందు జలమెక్కడ ఉంటుందో - మళ్ళీ అక్కడకే చేరుతుంది. ( సాగరం - మేఘం

- వర్షం - నది - సాగరం), అలాగే సంపద కూడా పూర్వమెక్కడున్నదో అక్కడికే చేరుతుంది. అటువంటి కాలం కోసం తిరిగి ఔన్నత్యాన్ని పొందేందుకు నిరీక్షిస్తున్నాను.

**'దైవేనకిల యస్యార్థః సునీతో ఽ పి విపద్యతే**
**దైవస్య చాగమే యత్న స్తేన కార్యోవిజానతా' - 9**

మానవుడు తన ప్రయత్నం ఎంత సవ్యంగా చేసినప్పటికీ, దైవం అనుకూలించకపోతే తిరిగి దైవ కృప కోసం ప్రయత్నించాల్సిందే. ఇంకా ద్రౌపది యిలా అన్నది. ''ఓ భీమసేనా! మునుపు ఎన్నో సుఖాలు అనుభవించిన నేను ఇపుడు పరాధీనన్నై ఉన్నాను. ఇది విధి వలన కలిగింది కాదు అని చెప్పజాలను. లేకపోతే భీకరమైన ధనుస్సు గల అర్జునుడు నివురుగప్పిన నిప్పులా ఎలా ఉన్నాడు.?

**'అశక్యా వేదితుం పార్థ ప్రాణినాం వైగతిర్నరైః**
**వినిపాత మిమం మన్యే యుష్మాకం హ్యావి చింతితమ్' - 18**

ప్రాణులకు వాటిల్లే అవస్థల్ని తెలిసికొనేందుకు ఎవరైనా అశక్యులే. అదే విధంగా, మీకీ అవమానావస్థ కూడా తెలియకుండానే వాటిల్లిందని భావిస్తాను.

# ఇరవై ఒకటవ అధ్యాయం

ద్రౌపదీ భీమసేనుల రహస్య సమాలోచన సంవాద సందర్భమే ఈ అధ్యాయంలోను కొనసాగింది.

ద్రౌపది తన దీనస్థితిని వివరించినపుడు భీమసేనుడామెకు భర్తలవెంట కష్టాలనుభవించిన పతివ్రతలను గూర్చి పేర్కొన్నాడు. ఈ పదమూడవ ఏడు పూర్తవగానే పూర్వ వైభవాన్ని పొందగలవని సముదాయించాడు. అపుడు ద్రౌపది సుదేష్ణ కొలువులో కీచకుని వలన తనకెక్క

పాట్లు రానున్నవో చెప్పి బాధపడుతూ ....

**'ప్రజాయాం రక్షమాణాయా మాత్మా భవతి రక్షితః**

**ఆత్మాహి జాయతే తస్యాం తేన జాయాం విదుర్బుధాః' - 41**

సంతానం రక్షింపబడినపుడు ఆత్మ రక్షింపబడుతుంది. ఆత్మయే భార్య యందు జన్మిస్తుంది. అందుకే భార్య 'జాయ' అనబడుతోంది.

**'భర్తాతు భార్యాయా రక్ష్యః కథం జాయాన్మమెాదరే**

**వదతాం వర్ణ ధర్మాంశ్చ బ్రాహ్మణానామితి శ్రుతః' - 42**

భర్త తన కడుపున (పుత్రుడై) పుడతాడు గాబట్టి భార్య కూడా భర్తను రక్షించుకోవాలి. వర్ణ ధర్మాలను వచించే బ్రాహ్మణుల వలన వర్ణ ధర్మాలిలా వినగలము.

ఆంధ్ర మహాభారతం ఆదిపర్వం చతుర్థాశ్వాసంలోని దుష్యంతోపాఖ్యానంలో శకుంతల దుష్యంతునితో ''పురుషుడు భార్య యందు ప్రవేశించి గర్భమున పుత్రుడై తాన యుద్భవిల్లు గావున అంగాదంగాత్ సంభవసి యనునది యాదిగా గల వేదవచనంబుల యందును జనకుండును, పుత్రుండును ననుబేధంబు లేదు'' అంటుంది.

**''అంగా దంగాత్సంభవసి - హృదయాదధి జాయసే**

**ఆత్మావై పుత్ర నామాసి - సజీవ శరదశ్శతమ్''** అనే వేదమంత్రానికి వ్యాసుడు సంస్కృతభారతములో ''ఉపజిఘ్రన్తిపితరో మంత్రేణానేనమూర్ధని'' అనే పాదం చేర్చి వివరించాడు.

ఓ పుత్రా! నీవు నా ప్రతి అంగము నుండి జన్మించావు. ఇటువంటి నీవు, పుత్రనామముతో నేనే అగుచున్నాను. నూరేండ్లు( చిరకాలం) జీవించు అని స్థూలంగా మంత్రార్థం. ఈ మంత్రం ద్వారా తండ్రి తనయుని మూర్ధాన్ని ఆఘ్రాణిస్తాడని సంస్కృత భారతం ద్వారా తెలియ వస్తున్నది.

**''ఉత్తరాభ్యామభిమంత్రణం మూర్ధన్యవఘ్రాణం దక్షిణ కర్ణే జపః నక్షత్ర నామ చ నిర్దిశతి''** అని ఆపస్తంబ సూత్రము. దీనిననుసరించి అభిమంత్రం, మూర్ధాఘ్రాణం, జపం అనే మూడూ కూడ రెండు మంత్రాలతో జరుగవలసి ఉంది. ఈ మంత్రాలు జాతకర్మ సందర్భంగా తండ్రి పుత్రుని అభిమంత్రించే సమయంలో మూర్ధాఘ్రాణం చేస్తూ, కుడి చెవిలో జపిస్తాడు.

అంగాదంగాత్..... ఇత్యాది మంత్రానికి ఈ సందర్భంగా చేర్చబడే రెండవ మంత్రం -

**''అశ్మాభవ - పరశుర్భవ - హిరణ్య మస్త్రుతంభవ**
**పశూనాం త్వా హింకారేణాభి జిఘ్రామ్యసౌ ''**

ఓ పుత్రుడా! రాయివలె దృఢమైన స్థిరమైన వానివి గమ్ము; గొడ్డలివలె పదునైన చురుకైన వానివి గమ్ము; పైన ఏ తొడుగు లేక పోయినను మాసిపోక ప్రకాశించు బంగారము వంటి వానివి గమ్ము; వాత్సల్యాతిశయంతో గోవు తన దూడను హింకారంచేస్తూ వాసన చూసే విధంగా, నేను పశుహింకారంతో నీ మూర్ధాన్ని ఆఘ్రాణిస్తున్నాను'' అని పై మంత్రార్థం.

**'క్షత్రియస్య సదాధర్మో నాన్యః శత్రు నిబర్హణాత్' - 42**

శత్రు నిబర్హణం (సంహారం) కంటె క్షత్రియుడికి తగిన ధర్మం వేరొకటి లేదు.

## ఇరవై ఎనిమిదవ అధ్యాయం

అజ్ఞాతవాసకాలం పూర్తయే సమయం ఆసన్నమవుతోంది. దుర్యోధనుడు పాండవులను ఎలాగైనా గుర్తించాలనే ఆలోచనలో ఉన్నాడు. ద్రోణుడు, కృపుడు, ధర్మజుని ఔన్నత్యాన్ని కీర్తించి అతని జాడ గుర్తించే ప్రయత్నానికి సమ్మతించారు. భీష్ముడు కూడా యుధిష్ఠిరుని మహత్త్వాన్ని వర్ణించి పాండవులను గుర్తించేందుకు సమ్మతించాడు. ఆ సందర్భంగా భీష్ముడు ఇలా ప్రవచించాడు.

**'వృద్ధాను శాసనే తాత తిష్ఠతా సత్యశీలినా**

**అవశ్యం త్విహ ధీరేణ సతాం మధ్యే వివక్షతా**

**యధార్థమిహ వక్తవ్యం సర్వదా ధర్మ లిప్సయా' - 12**

ఓ సుయోధనా! వృద్ధుల శాసనంపై నిలిచే సత్యశీలియైనవాడు సత్పురుషుల నడుమ పలుకవలసి వస్తే తప్పని సరిగా ధీరత్వంతోనే పలుకుతాడు. ధర్మాన్ని సాధించే ఉద్దేశ్యంతో ఎప్పటికీ అర్థమైన విధంగానే పలుకవలసి ఉంది.

## ఇరవై తొమ్మిదవ అధ్యాయం

కృపాచార్యుడు కూడా పాండవుల ఉనికిని గుర్తించేందుకు సమ్మతించిన సందర్భమిది. కృపుడు సుయోధనునితో ఇలా అన్నాడు.

**'నావజ్ఞేయోరిపుస్తాత ప్రాకృతో ఒపిబుభూషతా**

**కింపున: పాండవాస్తాత సర్వాస్త్ర కుశలారణే' - 4**

నాయనా! హితం కోరేవాడు, శత్రువు సామాన్యుడై ఉన్నా కూడా అలక్ష్యం చేసి ఉపేక్షించరాదు. ఇక పాండవులంతటి సర్వాస్త్ర నిపుణులైన మహానుభావుల విషయంలో మరెంత అప్రమత్తతతో వ్యవహరించాలో వేరే చెప్పే పనేముంది?

చిన్న పామునయినా పెద్ద కర్రతోనే కొట్టాలని అభిప్రాయం.

**ఉచ్చావచం బలం జ్ఞాత్వా మధ్యస్థం చాపి భారత**

**ప్రహృష్ట మప్రహృష్టంచ సందధామ తథాపరై: - 10**

మనం పరులతో పోరాడవలసి వచ్చినపుడు, ఎదిరి బలంలోని హెచ్చు తగ్గులు, మధ్యస్థమైన స్థితి (సమానస్థితి) బాగా తెలుసుకోవాలి. రాగద్వేషాలను బాగా గుర్తించాలి. అంటే శత్రువు మనకంటే బలవంతుడయితే సంధిచేసుకోవాలి. తక్కువ బలం, లేక సమబలం గల వాడయితే పోరాడాలి.

# ముప్పది ఎనిమిదవ అధ్యాయం
## - గోహరణ పర్వం -

బృహన్నల సారధ్యంలో కురుసైన్యాన్ని సమీపించిన ఉత్తరుడు భీతిజెంది పారిపోయే సందర్భంలో బృహన్నలిలా బోధించాడు.

**'నైష శూరైః స్మృతో ధర్మః క్షత్రియస్య పలాయనమ్**
**శ్రేయస్తు మరణం యుద్ధే న భీతస్య పలాయనమ్' - 29**

క్షత్రియుడు పారిపోవడమనే అధర్మపు ఆలోచనను మదిలోనికి రానీయకూడదు. భయపడి పారిపోవడం కంటే, యుద్ధరంగంలో చావడం మేలు.

ఎంత చెప్పినా ఉత్తరుడు వినలేదు.

'నివర్తయ రథం క్షిప్రం జీవన్ భద్రాణి పశ్యతి'

''రథాన్ని వేగంగా మరలించు. బ్రతికి యుండిన సుఖములు బడయవచ్చు'' అన్నాడు.

# నలభై తొమ్మిదవ అధ్యాయం

**మాయాహి బహవః సన్తి శాస్త్ర మాశ్రిత్య చిన్తితాః**
**తేషాం యుద్ధంతు పాపిష్ఠం వేదయన్తి పురావిదః - 2**

శాస్త్రాన్ని ఆశ్రయించి గ్రహించిన మాయలు అనేకం ఉండవచ్చు. కానీ పురావిదులు మాయాయుద్ధం పాపిష్టమైనదని చెప్తారు. అంటే జూదంలో మోసం చేసి గెలిచిన విధంగా వంచనాత్మకమైన యుద్ధంతో గెలవడం కుదరదని కృపాచార్యుని ఉద్దేశ్యం.

'దేశకాలేన సంయుక్తం యుద్ధం విజయదం భవేత్
హీనకాలం తదేవేహ ఫలం నలభతే పునః
దేశకాలేచ విక్రాంతం కల్యాణాయ విధీయతే' - 3

తగు దేశంలో, తగిన కాలంలో ఏర్పడిన యుద్ధం విజయాన్నిస్తుంది. హీనకాలంలో, కాలం కలిసిరానపుడు అదే యుద్ధం ఫలితాన్నివ్వదు. అందువల్ల దేశకాలాలను బాగా తెలిసి విక్రమిస్తే శుభం కలుగుతుంది. చాణక్యుడు రాజనీతి సూత్రాల్లో .....

''దేశకాల విభాగౌజ్ఞాత్వా కార్యమారభేత్'' అన్నాడు.

ఏ దేశంలో ఏకాలంలో ఏమి చెయ్యాలో తెలుసుకొని కార్యమారంభించాలి. ''నీతిజ్ఞ దేశకాలౌ పరీక్షేత'' నీతి నెరిగిన వాడు దేశాన్ని కాలాన్ని బాగా పరీక్షించుకోవాలి.

'అనుకూల్యేన కార్యాణా మంతరం సంవిధీయతే
భారంహి రథ కారస్య నవ్యవస్యంతి పండితాః' - 4

దేశ కాల పరిస్థితులు అనుకూలిస్తే తలపెట్టిన కార్యాలు ఫలిస్తాయి. తెలివిగల వారేవరూ రథాల చేసే వడ్రంగిపై భారం మోపి యుద్ధానికి పూనుకోరు. వడ్రంగిపై ఆధారపడి యుద్ధానికి దిగరనే ఒక సామెత. కొంతవరకు కుక్కతోక బట్టి గోదావరీదడం వంటిదనవచ్చు. అంతేగాక యుద్ధసమయంలో రథాలు కావాలి గానీ, రథాలు తయారైనపుడే యుద్ధం అంటే ఎలా?

కృపాచార్యుడింకా అనేక విధాల కర్ణుణ్ణి మందలించాడు. క్రుద్ధమైన సర్పాన్ని కుడిచేతి చూపుడు వ్రేలితో తాకి దంష్ట్రలు పెరికి వేయాలనుకుంటున్నావు. నెయ్యి, మెదడు, వసలన హోమం చేసినపుడు ఉవ్వెత్తుగా ఎగసిపడుతున్న అగ్ని జ్వాలలను నేతితో తడిపిన వస్త్ర ధరించి మధ్య నుండి దాటాలని చూస్తున్నావు. జాగ్రత్త అన్నాడు.

'సమిద్ధం పావకం చైవ ఘృతమేదో వసాహుతమ్
ఘృతాక్త చీర వాసాస్త్వం మధ్యే నోత్తర్తుమిచ్ఛసి'

# ఏభయ్యవ అధ్యాయం

ఇప్పుడు కర్ణుణ్ణి నిందించడం అశ్వత్థామ వంతు. ఏమయ్యా! ఇంకా మనం గోవుల్ని ులుకొని పోవనేలేదు. శత్రు రాజ్యపు హద్దులు దాటనే లేదు. హస్తినకు చేరనే లేదు. ఇవన్నీ ధించినట్లు నీవేమో ముందుగానే తెగ ప్రగల్భాలు వదరుతున్నావు.

**'సంగ్రామాంశ్చ బహూంజిత్వాలబ్ధ్వాచ విపులం ధనమ్**

**విదిత్యచ పరాం సేనాం నాహుః కించిన పౌరుషమ్' – 2**

హు సంగ్రామాలు జయించి, విస్తారంగా ధనం సాధించి, పరసేనను పరాజితుల్ని చేసి కూడా ద్ధిమంతులు పౌరుషాన్ని ప్రకటించుకోరు.

**'దహత్యగ్ని రవాక్యస్తు తూష్ణీం భాతి దివాకరః**

**తూష్ణీం ధారయతే లోకాన్ వసుధా సచరాచరాన్' – 3**

గ్ని ఒక్క మాట కూడా పలుకకుండానే దహించి వేస్తుంది. సూర్యుడు నోరు మెదపకుండానే కాశిస్తాడు. భూమి ఏమీ పలుక కుండానే చరాచర ప్రాణికోటిని మోస్తున్నది.

'మొరిగే కుక్క కరవదు' అని భంగ్యంతరంగా అధిక్షేపిస్తున్నాడు అశ్వత్థామ.

కర్ణుడు గురువైన ద్రోణునిపట్ల చులకన భావంతో యుద్ధ విషయాలలో బ్రాహ్మణుణ్ణి ంప్రదించరాదు అని వదరిన మాటలకు అశ్వత్థామ తగిన సమాధానం చెప్తున్నాడు –

స్వయంభువుడైన భగవంతుడు చాతుర్వర్ణాల వారికి వారి వారి విధుల్ని ఏర్పరిచాడు. మి చేస్తే లబ్ది కలుగుతుందో, ఏమిచేస్తే దూషితుడు కాడో చెబుతాను విను.

**'అధీత్య బ్రాహ్మణో వేదాన్ యాజయేత యజేతవా**

**క్షత్రియో ధనురాశ్రిత్య యజేచ్చైవ నయాజయేత్' – 5**

బ్రాహ్మణుడు వేదాధ్యయనం చేసి యజ్ఞాలు చేయడమో, చేయించడమో ఆచరించాలి. అది వాని కర్తవ్యం. క్షత్రియుడు ధనుస్సును ఆశ్రయించాలి. అంటే శస్త్ర జీవనం క్షత్రియుని కర్తవ్యం. క్షత్రియుడు యజ్ఞం చేయవచ్చు, కానీ చేయించే అర్హత లేదు.

''ఆచార్యావైకారుణికాః ప్రాజ్ఞాశ్చా పాపదర్శినః ...'' అని హేళన చేసిన కర్ణుణ్ణి నువ్వే కులస్థుడివి? యుద్ధం చేసే అర్హత గల కులస్థుడివా అని నిలదీయడం అశ్వత్థామ ఆంతర్యం.

**'వర్తమానాయథాశాస్త్రం ప్రాప్యచాపి మహీమిమామ్**

**సత్కుర్వంతి మహాభాగా గురూన్ సువిగుణానపి' – 7**

శాస్త్రప్రకారం ప్రవర్తించే ఉత్తములు – గురువులు గుణహీనులైనా కూడా వారిని సత్కరిస్తారు. (నీ వలె గురుదూషణకు, గుర్వవజ్ఞకు తలపడరని భావం)

సుయోధనుని మెప్పు పొందడంలో కర్ణుని అత్యుత్సాహం ఎన్నో అధర్మాలకు అతణ్ణి గురిచేసింది. అన్నీ తెలిసిన కర్ణుడు ద్రోణుణ్ణి అనేక పర్యాయాలు చులకన చేశాడు.

'హరారుష్టే గురుస్త్రాతా గురౌరుష్టే నశంకరః' అన్నట్లుగా హరుడు కోపిస్తే గురువు రక్షిస్తాడు. గురువు కోపిస్తే శంకరుడు కూడా రక్షించలేడు.

**పుత్రాదనంతరం శిష్య ఇతి ధర్మ విదో విదుః**

**ఏతేనాపి నిమిత్తేన ప్రియో ద్రోణస్య పాండవః – 21**

ధర్మ విదులైన వారు కొడుకు తర్వాత శిష్యుడూ అటువంటివాడే అని చెబుతారు. అందువల్లనే అర్జునుడు ద్రోణుడికి మిక్కిలి ప్రీతి పాత్రుడు. గురు శిష్య సంబంధం తండ్రికొడుకుల సంబంధం వంటిదనే సత్సంప్రదాయం మనది. ఆనాటి గురుకులాల్లో ఆ సంబంధం అంత వాత్సల్యపూరితంగా, పవిత్రంగా వర్ధిల్లింది. ఆ రోజులు వేరు.

''గురులకు శిష్యులు పుత్రులు

పరమార్థము లోక ధర్మపథమిది .....'' అంటాడు తనను వలచిన దేవయానితో బృహస్పతి పుత్రుడైన కచుడు. (ఆంధ్రమహాభారతం - ఆదిపర్వం)

యముడు, వాయువు, అగ్ని (బడబానలం) ఇవి ఒకవేళ శేషం మిగులుస్తాయేమో గానీ, క్రుద్ధుడైన ధనంజయుడు మాత్రం శత్రుశేషం మిగల్చడు. ఆనాడు సభలో శకుని సాయంతోనే జూదమాడి గెలిచావు గదా! ఇపుడు కూడా ఆ శకుని సాయంతోనే యుద్ధం చేసుకో - ఈ వీరులంతా ఎవరి ఇష్టం మేరకు వారు పోరాడితే పోరాడనీ, నేను మాత్రం అర్జునునితో యుద్ధం చేయను. గోవుల కోసం విరాటరాజు వస్తే అతనితో మనం యుద్ధం చేయాలి గానీ అర్జునునితో మనకేం పని; అని నిక్కచ్చిగా చెప్పాడు అశ్వత్థామ.

## ఏభై ఒకటవ అధ్యాయం

కృపాచార్యుడు, అశ్వత్థామ కర్ణుణ్ణి తీవ్రంగా మందలించారు. వాదోపవాదాలతో, ప్రగల్భాలతో వాతావరణం వేడెక్కిపోతోంది. అప్పుడు సైన్యంలో శాంతిని స్థాపించేందుకు భీష్ముడు ప్రయత్నం చేశాడు. ఆ సందర్భంగా ఇలా అన్నాడు -

**ఆచార్యో నా విభక్త వ్యః పురుషేణు విజానతా**
**దేశకాలౌతు సంప్రేక్ష్య యోద్ధవ్యమితివేమమతిః - 2**

తెలిసిన వాడెవడూ గురువును భంగపరచడు. నా అభిప్రాయం ప్రకారం దేశకాల పరిస్థితుల్ని బాగా ఆలోచించి గమనించి యుద్ధం చేయడం సరైనది.

కర్ణుడు తన ప్రతాపాన్ని వ్యక్తం చేసేందుకు ఏదో మాట్లాడి ఉండవచ్చు. కాబట్టి అశ్వత్థామ వాని మాటల్ని క్షమించాలి. ఇది మనలోమనం విభేదాలు తెచ్చుకునే తరుణంకాదు. అందరం ఏకమై వాసవ నందనునితో పోరాడాలి.

**'బలస్య వ్యసనా నీహ యాన్యుక్తాని మనీషిభిః**

**ముఖ్యా భేదోహి తేషాంతు పాపిష్ఠో విదుషాంమతః' - 13**

సైన్యానికి వాటిల్లే హాని ఏమిటి? అన్నప్పుడు 'భేదము' అని వివేకం గలవారు ప్రధానంగా వక్కాణిస్తారు. అది పాపిష్ఠమైనదని పండితులు చెబుతారు.

ఇలా మనలోమనం వాదించుకొని భేదాలు తెచ్చుకొంటే తప్పక హాని జరుగుతుంది, అని పితామహుని హెచ్చరిక.

**'శత్రోరపి గుణ గ్రాహ్యాః దోషావాచ్యాగురోరపి**

**సర్వథా స్వయత్నేన పుత్రీ శిష్యే హితం వదేత్' - 15**

శత్రువయినప్పటికి మంచి గుణాలుంటే గ్రహించాలి. గురువయినా సరే దోషముంటే నిందించాలి. సర్వయత్నాలచేత శిష్య పుత్రుల విషయమై హితాన్నే పలకాలి.

భీష్ముని ఈ సూక్తి ఇంతకు మునుపు అశ్వత్థామ చెప్పిన మాటకు విరుద్ధంగా ఉన్నది. ఏదైనా సందర్భాన్ని బట్టి దేనిని అనుసరించాలి అనేది నిర్ణయించుకోవాలి. అంతేగాక అశ్వత్థామ గురు పుత్రుడు కాబట్టి అతనికి గురువులు గుణహీనులైనా వారిని సత్కరించాలనే విధంగా గురు పక్షపాతం ఉండటం సహజమే.

## అరవై ఆరవ అధ్యాయం

యుద్ధం భీకరంగా జరుగుతోంది. అసహాయ శూరుడైన అర్జునుడు అనంత కౌరవాక్షౌహిణుల్ని కల్లోలితం చేస్తున్నాడు. చివరికి సమ్మోహనాస్త్రం ప్రయోగించాడు. అనంతరం తన గొప్పదైన శంఖాన్ని రెండు చేతులతో పట్టుకొని దశదిశలు దద్దరిల్లేట్లు బలంగా పూరించాడు. ఆ శంఖనాదం చేత కురు వీరులు ధనుస్సులు వదలి మూర్ఛనొందారు. అప్పుడ

అర్జునుడు స్మృతి తప్పిన వారి నడుమకు ఉత్తర తెమ్మనిన బొమ్మపొత్తికల కోసం ఉత్తరుణ్ణి వెళ్ళుమని ఏఏ వస్త్రాలు ధరించిన వారెవరో వివరించాడు. వాటిని తెమ్మన్నాడు. అయితే భీష్మాచార్యుడు స్పృహకోల్పోయి ఉండడని అర్జునుడికి తెలుసు. అందుకే ఇలా అన్నాడు.

**'భీష్మస్య సంజ్ఞాంతు యథైవ మన్యే**
**జానాతి సోऽస్త్ర ప్రతిఘాతమేషః**
**ఏతస్య వాహాన్ కురు సవ్య తస్త్వ**
**మేవంహి యా తవ్య మమూఢ సంజ్ఞైః' – 14**

ఓ విరాటపుత్రా! భీష్ముడు మూర్ఛనొందియుండడని అనుకుంటున్నాను. ఎందుకంటే, ఈ అస్త్రానికి విరుగుడు ఆ మహాత్మునికి తెలుసు. అందువల్ల మన అశ్వాలను ఆయనకు ఎడమవైపుగా పోనివ్వు. స్మృతి తప్పని వారికి ఎడమవైపుగానే వెళ్ళాలి సుమా!

ఇందులో ప్రత్యేకించి సూక్తి ఏమిలేదుగానీ, స్మృతిలో నున్న వారికి కుడివైపుగా పోరాదు అనే ఓ మర్యాద, ఆచారం తెలియవస్తున్నది.

అనుష్టుప్పులనే అంతటా వాడిన వ్యాసుడు ఇంతకు మునుపు కూడా అక్కడక్కడ ఇంద్ర వజ్ర వంటి ఇతర వృత్తాలను కూడా స్పృశించాడు. 65, 66 అధ్యాయాలు పూర్తిగా ఇంద్ర వజ్ర వృత్తాలతోనే రచించాడు. ఈ శ్లోకం ఇంద్ర వజ్రమే. ఇందులో త,త,జ,గా అనే గణాలుంటాయి.

**''తకారాభ్యాం జకారేణ యుక్తం, గురు యుగేణచ**
**ఇంద్రవజ్రాభిదం ప్రాహుర్వృత్త మేకా దశాక్షరమ్''** అని

క్షేమేంద్రుని సువృత్త తిలకంలో దీని లక్షణం చెప్పబడింది.

# అరవై ఏడవ అధ్యాయం

విజయుడు విజయం సాధించాడు. కౌరవులు మరలిపోయారు. సైనికులు చావు ద
కన్నులొట్టబోయి దిక్కులేనివారై భయకంపితులై ముడివీడి వ్రేలాడే జుట్టుగలవారై అర్జునుం
నమస్కరిస్తూ నిలిచిపోయారు. దేశంగాని దేశంలో ఆకలి దప్పులతో అలమటిస్తూ విభ్రాం
చిత్తులై అర్జునునితో ''ఓ పార్థా! మేము నీదాసులం. మాకిప్పుడు నాయకుడు లేడు. నీ
ప్రాణభిక్ష అర్థిస్తున్నాం''; అని ప్రార్థించారు. అప్పుడు అర్జునుడిలా అభయమిచ్చాడు.

'అనాథాన్ దుఃఖితాన్ దీనాన్ కృశాన్ వృద్ధాన్ పరాజితాన్

న్యస్త శస్త్రాన్ నిరాశాంశ్చ నాహం హన్మి కృతాంజలీన్' – 6

అనాథల్ని, దుఃఖితుల్ని, దీనుల్ని, కృశించిన వారిని, వృద్ధుల్ని, ఓటమి పొందిన వారి
నిరాయుధుల్ని, నిరాశతో కూడిన వారిని, దోసిలి యొగ్గి నమస్కరించి శరణు కోరిన వా
నేను సంహరించను.

శరణాగత రక్షణ ఉత్తముడైన వీరుని లక్షణం. అర్జునుడు ఇక్కడ అదే ప్రదర్శించాడ

కౌరవ సైనికులు అంజలిబద్ధులై అర్జునుణ్ణి శరణు వేడారు.

'అంజలి' అంటే చేతులు మొగిడ్చి నమస్కరించడం. ఈ సందర్భంగా రెండు పాదా
కూడా కలిపి ఉంచడం పరిపాటి. అంజలి అనేది అత్యంత ప్రాచీన సాంఘిక సంప్రదాయ
అంజలి శబ్దం అన్, జలి అనే పదాల కలయికచే ఏర్పడింది. 'జలి' అనేది 'చలి' శబ్ద పరిణా
రూపం. 'అన్' – అనేది వ్యతిరేకార్థాన్ని సూచిస్తుంది. అన్ జలి – అంజలి అంటే కద
నిశ్చలంగా ఉండటం అని అర్థం.

కాలక్రమంగా అంజలించే సందర్భంలో ఎన్నో మార్పులు వచ్చినా, ప్రాథమికంగా తనక
బలవంతుడు, అధికుడు అయిన వాని ముందు భయ భక్తులతో చేతులు మొగిడ్చి నిలబడట

అంజలి.

అసలిలా వినమ్రంగా అంజలించే సంప్రదాయం ఎప్పటిది? అత్యంత ప్రాచీన కాలంలో, ఓడిపోయినవాడు క్షమాభిక్షనర్థిస్తూ అంజలిబద్ధులవడం పరిపాటిగా తెలుస్తోంది. షికారీ కథల్లో – కోతులు తప్పించుకొనే వీలు లేక, శరా ఘాతానికి గురికాక తప్పని విపత్కర పరిస్థితిలో నిశ్చలంగా నిలిచి చేతులు మొగిడ్చి కన్నీరు కారుస్తున్నట్లు వర్ణించబడి ఉంది. దీన్ని బట్టి అంజలిబద్ధ భంగిమకు నాగరిక మానవ చరిత్రకు మించిన ప్రాచీనత ఉందని చెప్పవచ్చు. కౌరవ సైనికులు అర్జునుని ఎదుట కృతాంజలులైనది ప్రాణరక్షణకే. అంజలించడానికి వచో రూపం 'నమస్తే' అనే అభివాదం. ఇది 'నమః', 'తే' అనే రెండు పదాల కలయిక. 'నమః' అనేది 'న మమ' అనే దాని సంక్షిప్త రూపం. 'న' లేదు, కాదు అనే వ్యతిరేకార్థక శబ్దం. 'మమ' అంటే నా కొఱకు మాత్రమే, నాకొఱకు కాదు'' అనే విధంగా స్వార్థరాహిత్యాన్ని వ్యక్తపరచడమన్నమాట.

## అరవై ఎనిమిదవ అధ్యాయం

విజయవార్త విరాటనగరం చేరింది. విరాటరాజు అదంతా తన కుమారుడి ప్రజ్ఞే అనుకున్నాడు. నగరమంతా విజయోత్సవం! ఆ సందర్భంగా విరాటరాజు అత్యంత సంతోషంతో ''ఓ సైరంధ్రీ! పాచికలు తీసుకొనిరా. రావయ్యా కంకుభట్టా! జూదమాడుదాం సరదాగా'' అన్నాడు. అపుడు ధర్మజుడు విరటునితో ఇలా అన్నాడు :–

**'నదేవితవ్యం హృష్టేన కితవేనేతి నః శ్రుతమ్' – 31**

మిక్కిలి సంతోషంతో ఉప్పొంగిపోతున్న జూదరితో జూదం ఆడకూడదని వినియున్నాను. పట్టరాని పొంగులో ఉన్నవాడు ఒళ్ళు తెలీకుండా పణం ఒడ్డుతాడు. తెగింపుతో ఆడతాడు. ఇందువల్ల విపరీత పరిణామాలు ఏర్పడవచ్చు.

సంతోషం వల్ల రెచ్చిన ఉత్సాహంతో అతడు ప్రతి పందెమూ గెలువవచ్చు, లేదా ఓడిపోనూ వచ్చు. ఓడిపోతుంటే అంతటి సంతోషం క్రమంగా తొలగి అది క్రోధంగా పరిణమించవచ్చు. ''హృష్టోదృప్యతి దృప్తో ధర్మ మతి క్రామతి'' అని స్మృతి వాక్యం. మిక్కిలి సంతోషంలో ఉన్నవాడు గర్విస్తాడు. గర్వితుడు ధర్మాన్ని అతిక్రమిస్తాడు. ఇదే ధర్మరాజు ఉద్దేశ్యం. ఇది అక్షరాలా నిజమని ధర్మజుడు తరువాత నిరూపించాడు – తనను విరటుడు పాచికలతో ముక్కుపై కొట్టినపుడు.

**''నదూషయామితే రాజన్ యదేవై హన్యాద దూషకమ్**

**బలవంతం ప్రభుంరాజన్! క్షిప్రం దారుణమాప్నుయాత్'' – 65**

అన్నాడు. అంటే, తప్పుచేయని వాణ్ణి కొట్టావు. అయినా నీ పనిని నేను నిందించను. ఎందుకంటే బలవంతుడైన ప్రభువును ఇట్టి దారుణాలు వేగంగా చేరుతుంటాయి అన్నాడు. రాజు మాటను కాదనలేక ''నాకిష్టం లేకపోయినా నీ సంతోషం కొద్దీ ఆడమంటే ఆడతా'' నన్నాడు.

**'కింతే ద్యూతేన రాజేంద్ర బహుదోషేణ మానద**

**దేవనే బహవో దోషాః తస్మాత్ తత్ పరివర్జయేత్' – 33**

ఓ రాజా! బహుదోషాలతో కూడిన ఈ ద్యూతం ఎందుకు చెప్పు? ఈ జూదాన్ని వదలిపెట్టు.

**'అస్మిక్షితి వినాశశ్చ వాక్పారుష్యమనంతరమ్ –**

**అవిశ్వాసం బుధైర్నిత్యం ఏకాహ్నే ద్రవ్యనాశనమ్ – 36**

ఈ జూదం వల్ల రాజ్యం వినాశనమవుతుంది. కఠినంగా మాట్లాడే స్థితి వస్తుంది. ఎంత పండితులకైనా విశ్వాసం నశిస్తుంది. ఒక దినంలోనే ధనమంతా నశించి పోతుంది.

మాట తూలడం వల్ల మిగిలిన అనర్థాలన్నీ దాపురిస్తాయి. వాక్పారుష్యం గురించి చాణక్యుడు ''అగ్ని దాహోదపి విశిష్టం పరుషవాక్యం'' అన్నాడు. వాక్పారుష్యం అగ్ని కన్నా

అధికంగా దహిస్తుంది. అందుకే నోరు మంచిదయితే ఊరు మంచిదవుతుందంటారు మనవా
విరటుని తృప్తికోసం ధర్మజుడు జూదమాడసాగాడు. కౌరవులతో జరిగిన యుద్ధంలో విజం
పొందడం బృహన్నల వల్లనే సాధ్యమయిందని, వారించినా వినకుండా ధర్మరాజు పదే పదే అనే
విరటుని కోపం పెచ్చురేగిపోయింది.

ఎన్ని పర్యాయాలు వద్దన్నా నోరుమూసుకోకుండా అదేమాట పల్కుతున్నావు.

**'నియంతా చేన్నవిద్యేత న కశ్చిద్ధర్మ మాచరేత్' - 45**

కట్టడి చేసే పైవాడు లేకపోతే ఎవడు ధర్మాన్ని ఆచరిస్తాడు? చెప్పేవాడు లేక వాగుతున్నా
అని విరటుని భావం.

రౌతు మెత్తనయితే గుఱ్ఱం మూడు కాళ్ళ మీద నడుస్తుంది అనే సామెత వంటిదే ఆ

ఈ విధంగా హృదయాహ్లాది, ఊర్జిత కథోపేతము, నానా రసాభ్యుదయోల్లాసి అం
విరాట పర్వంలో కూడా వ్యాస భగవానుడు సందర్భానుగుణంగా అనేక ధర్మాలను పా
ద్వారా ప్రబోధించి జగద్ధితాన్ని ఆకాంక్షించాడు.

**నమోస్తుతే వ్యాస విశాలబుద్ధే**
**ఫుల్లార విందాయత పత్రనేత్ర**
**యేనత్వయా భారత తైలపూర్ణః**
**ప్రజ్వాలితో జ్ఞానమయ ప్రదీపః**
**నమః ఛందో విధానాయ సువృత్తా చారవే ధసే**
**తపస్సత్య నివాసాయ వ్యాసాయామిత తేజసే -**

**- స్వస్తి -**